# భగవద్గీత

## ( గేయమాల )

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతం
అద్వైతామృత వర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయిని
మంబ! త్వామనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్ ॥

ప్రచురణ

"భద్రగిరి"

రచన

''రామదర్శనప్రభాసి''

సూరంపూడి రాధాకృష్ణమూర్తి

ప్రథమ ముద్రణ
డిసెంబరు 1980

వెల : ఐదు రూపాయలు

ప్రతులకు

భద్రగిరి ప్రచురణలు

16-11-418/3/1
దిల్‌సుక్‌నగర్, హైదరాబాద్-36

ముఖచిత్రం

శ్రీ పేరి సుబ్బారావు, దిల్‌సుక్‌నగర్

ముద్రణ

పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ-హైదరాబాదు

## వినాయకస్తుతి

ఏకదంతము శూర్పకర్ణము
చలువచూపుల చిన్నవాడా
పార్వతమ్మకు ముద్దుకొమరుడ
విఘ్నరాజా వందనము.

## అంకితం ఏడుకొండల స్వామికి

ఈమాల నీకొరకు నామాల నాస్వామి
తోమాలసేవలో చేరి మురిసేనయ్యా
ఈ మూలనున్నాను నిన్నందుకోవాలి
ఓమూల చోటియ్యి నీపాదపీఠాన.

# గేయ కుసుమాలు

# నిమిత్తమాత్రం - భవసవ్యసాచిన్

పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవ మజం, విభుమ్॥

అనంతకోటి బ్రహ్మాండ నాయకా!ఆది మధ్యాంత రహితా! పరమాత్మా ! అనే పదాలకు అర్థం ఖగోళశాస్త్రములో కాని, ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతములో కాని, డార్విన్ పరిణామ వాదములో కాని లభించవు.

జన్మ ఎందుకు అనే ప్రశ్న, జన్మించిన ప్రతి జీవికి కలిగేదే. మత మనేది మత్తుమందు కాకుండా మానవతకు బుద్ధి, తర్కము, స్వానుభవము జోడించి భక్తి, కర్మ, జ్ఞాన, వైరాగ్య మార్గాలను సమన్వయించిన శాస్త్రమే గీత.

ఉపనిషత్తుల సారము, వేదముల భావము, ఇతిహాసాల గమ్యము అయిన ఆత్మతత్వము ఎన్ని జన్మల సంస్కారమో ! 'వాసుదేవుడు వినా ఏమీలేదు' అనే భావాన్ని, పరమాణువులో, అంతర్వాణిలో, నీలి పథంలోని తారలలో, నీటిలో, గాలిలో, మంటలలో, రవిలో, రేరాజులో, అంచుల్లేని అంబరములో, విశ్వంలో, విశ్వనాథునిలో, అన్నిటను కల ఆ విష్ణువేనని, గీతాకారుడు చాటించి చెప్పినా- అది హిమవన్నగ సమాన ధీశాలురగు ఆదిశంకరులకో, ప్రాక్ పశ్చిమాలకు వారధులయిన ఏ వివేకానందునికో, మాక్సుముల్లరు మహర్షికో కాని మనలాంటి మామూలు మనుషులకు అది అందని ఫలము. 'మడి'లోని లడ్డు బాలునకు అందదు.

రాధాకృష్ణమూర్తి, చిన్ని కృష్ణుని గీతాసారం అనే పాల భాండానికి తేట తియ్యని తెలుగులో కంతకొట్టి, మనలను క్రిందనే నిలపడి అట్లులు చాచి జుర్రుకోమన్నాడు. ''సర్వజగత్తున నిండినయట్టి పరమాత్మ శాశ్వతము.'' ''పుట్టకమునుపు ప్రాణులు ఎక్కడో-పుట్టి మనుచు మరి కనబడుచుండును-మరణించిన మరి తెలియదు ఉనికి-కావున ఏల వంత నొందుట?''- ''అనంత విశ్వము నా స్వరూపమున-అంశమాత్రమని తెలియుము నీవు''

సరళశైలిలో సూటిగా మనస్సులో నాటేలాగ ఉన్నాయి భావాలు. అవి గీతాకారుని సూక్తులకు కత్తిలేని తెలుగు పలుకులు. 'వీటిని చూచా మనం భయపడ్డాము' అనిపించే టంతటి తేలిక చేయబడ్డాయి ఆ మహా వాక్యాలు తీయ తెలుగులో. భారమైన భావాన్ని కొంచెం కూడా చెదరగొట్టలేదు. మనకు మాత్రం బెదురు తగ్గించారు రచయిత.

త్యాగయ్య, గోపన్నల ఒరవడి మనది. వుదాత్త భావాలను పసిడిపండ్ల తొనలలాగున ఒలిచిపెడితే చాలు మనకు. ఆ పని చాలా చక్కగా చేశావయ్యా రాధాకృష్ణయ్యా !

శరీరానికి అతీతమయినది మనస్సనీ, దానికి ఆవల బుద్ధి అనీ, అన్నిటికీ ఆవతల ఆత్మ అనీ, దానికి ఏవీ అంటవనీ; మొదలు, కొన లేనిదని, అది సర్వవ్యాప్తమని, ఉపాధిని పట్టివున్న లక్షణాలే కాని స్వయంగా నిర్వికల్పమై, నిశ్చలమై, నిరామయమై, నిర్గుణమై, నిరంజనమైన ఈశ్వరుడే విశ్వమని, నిరీశ్వరమైన అనాత్మ పదార్థము మిధ్యేకాని 'ఆత్మబ్రహ్మ' లాగా సత్యము కాదు అనే ఆత్మ వాదాన్ని కవిగా, గురువుగా, శాసనకర్తగా, ధర్మనేతగా, సాధు రక్షకుడుగా, మిత్రునిగా, మంత్రిగా, పరంధామునిగా, విశ్వనాథునిగా ప్రవచించిన శ్రీకృష్ణపరమాత్మయొక్క సూక్తులను తియ్యని గంగలా, పారే సెలయేటి నీరులా మన మనోక్షేత్రాలకు అందించి, భక్తి సస్యాలను పండించిన చిరుకృషీవలునికి నా శుభాశీస్సులు.

లోకంబులు లోకేశులు లోకస్థులు తెగినతుది నలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వండేకాకృతి వెలుగు నతని నే సేవింతున్.

శ్రీ రామగిరి రామచంద్రరావు
అడ్వొకేట్.

శ్రీరామ సదన్-హైదరాబాద్.
12-12-1980.

# మనసులో మాట

శ్రీ సూరంపూడి రాధాకృష్ణమూర్తిగారిచే తెనుగులో గేయ రూపంలో రచింపబడిన "భగవద్గీత" వ్రాత ప్రతిని నేను పఠించు నవకాశము చిక్కినది. ఆ గ్రంథమును పఠించి నేను పొందిన యానందమింతంతయని చెప్పనలవి కాదు. ఈయనచే యింతకు మునుపు రచించబడిన శ్రీమద్రామాయణము నందలి 'సుందరకాండ' 'బాలకాండ' గేయ కావ్యములను కూడ పఠించితిని. మూలమున కతి సన్నిహితముగ తేట తెనుగులో అలతి అలతి పదములతో అత్యంత మనోహరముగ లిఖింపబడిన యా కావ్యములు నాకు మహదానందము కలిగించినవి. అయితే వాటిలో ఒక నిర్దిష్టమైన కథా సంవిధాన మున్నది. అద్దాని ఆధారముగా వాటి రచన సాగినది. కాని ఏ కథా సంవిధానము లేక, కేవలము వేదాంత ప్రాముఖ్యమైన భగవద్గీతను తేటతెనుగులో పామరులకు కూడ అర్థమయ్యే అలతి అలతి పదములతో అతి రమ్యముగ, భావము, ఉదాత్తత ఏమాత్రము చెడకుండ ఒక గేయరూపమైన గ్రంధరచనకు పూనుకొనుట ఈ యువర చయిత మనోవిశ్వాసమును, ధైర్యమును, ఉత్సాహమును చెప్పక చెప్పుచున్నది. శ్రీ రాధాకృష్ణ మూర్తిగారి వంటి యువ రచయితలు నడుంకట్టి ముందుకు వచ్చిహిందూమత ఉత్కృష్టతను పామరులకు గూడ అర్థమయ్యే భాషలో ప్రబోధింపవలసిన ఆవశ్యకత మాటలతో చెప్పనలవికాదు. అట్టి తరుణములో శ్రీ సూరంపూడి రాధాకృష్ణమూర్తి గారు ఈ భగవద్గీతను తేట తెనుగులో గేయ రూపములో ఇంటింట జానపద గేయములవలె పాడుకొనుటకనువగు సరళిలో రచించుట, ముదావహము.

శ్రీకృష్ణ భగవానుడు శ్రీ రాధాకృష్ణమూర్తిగారికి ఆయురారోగ్య ఐశ్వర్యములిచ్చి యిటువంటి రచనలు ఎన్నో చేయించాలని ప్రార్థిస్తున్నాను.

తెలికిచర్ల మల్లిఖార్జునరావు
మలక్ పేట.

హైదరాబాద్.
10-12-1980.

# ముందు మాట

వేదాల్లో రెండు భాగాలున్నాయి. 1. పూర్వభాగము. 2. ఉత్తరభాగము. పూర్వభాగము మానవుడు అనుసరించాల్సిన ధర్మాచరణ విధానాన్ని వివరిస్తుంది. ఉత్తర భాగము సర్వజగత్తుయొక్క సృష్టి, స్థితి, లయ కారకుడై సర్వత్రా వెలుగొందే సత్యస్వరూపమైన పరమాత్మను గూర్చిన జ్ఞానాన్ని అందిస్తుంది. మానవుని జీవితానికి పరిపూర్ణతను చేకూర్చే సాధనాలు ఈ రెండు. ఒకటి మానవుడు నడవటానికి కాలిబాట అయితే, గ్రుడ్డిగా ఆ బాటలో నడవకుండా వెలుగును అందిస్తుంది రెండవది. మానవుని బహిర్గత నడవడికి సంబంధించింది ధర్మము. అతర్గతంగా మానవుని యొక్క ఉన్నతికి తోడ్పడి శాశ్వత సౌఖ్యాన్ని మనఃశాంతిని అందిస్తుంది జ్ఞానము. ఈ రెండింటియొక్క మేటి సమ్మేళనమే భగవద్గీత. అందుకే ఇది వేదసారము. ఉపనిషత్సారము. జ్ఞానంతో కూడుకున్న ధర్మయుక్త కర్మాచరణాన్ని ప్రబోధిస్తుంది భగద్గీత.

భగవద్గీతలో ప్రధానంగా రెండు యోగనిష్ఠలు తెలుపబడినవి. 1. కర్మ 2. జ్ఞాన. ఈ రెండింటిలోని అంతర్భాగంగా భక్తి పరిగణించబడింది. కాని ఆరేసి అధ్యాయాల్ని ఒక షట్కం చొప్పున కర్మ, భక్తి, జ్ఞాన షట్కాలని మూడు షట్కాలుగా విభజించటం పరిపాటి. ''లోకేస్మిన్ ద్వివిధానిష్ఠా'' అన్నాడు భగవంతుడు. కర్మ, జ్ఞాన యోగాలని తెలుపుతూ, కర్మ మార్గము ప్రవృత్తికి సంబంధించింది. సంసారంలో మునిగి వుండే వానికి మోక్షము దుర్లభమనీ, కేవలం జ్ఞానంతో కర్మను పరిత్యజించటమే మార్గమనే భావన ఎందరిలోనో వుంది. అందుకే నివృత్తి కొరకు సన్యాసంతో కూడుకున్న నివృత్తి మార్గం సూచించబడింది. కాని కృష్ణ భగవానుడు ప్రవృత్తిలో నివృత్తినీ, సంసారంలోనే సన్యాసాన్ని సూచించారు. శంకరభగవత్పాదులు ''భగవద్గీతా కించి దధీతా-గంగాజలలవకణికాపీతా'' అన్నారు. ఏ కొంచెం అవగాహన చేసుకుని ఆచరించినా జన్మ ధన్యమౌతుంది. ఇటువంటి ఉత్తమ గ్రంథాన్ని తేటతెలుగు భాషలో తెలుగు వారికి అందజేసిన శ్రీ సూరంపూడి రాధాకృష్ణమూర్తిగారు ధన్యజీవులు.

హైదరాబాదు
15-12-1980.

శ్రీమతి బొడ్డుచర్ల రాజేశ్వరి భగవాన్
M.A.

# కృతజ్ఞతా కుసుమాలు

భగవద్గీత (గేయమాల) శ్రీ స్వామి రంగానాథానంద్, రామకృష్ణ మఠం, హైదరాబాద్, వారి దివ్య హస్తాలతో ఆవిష్కరించబడటం నా అదృష్టం. వారికి నాకృతజ్ఞతా సుమాలు.

భగవద్గీత అధ్యయనం చేసిన చేస్తున్న పుణ్యమూర్తులందరికీ నమస్సుమాంజలులు. ఇటువంటి గేయ రచనా ప్రయత్నంలో మొదటిది సుందర కాండము. తరువాత బాలకాండము. ఇప్పుడు ఈ గేయమాల వ్రాసే భాగ్యం కలిగింది. భగవద్గీత వేదాంతం, యోగశాస్త్రం అర్థం అవుతుందా చదివినా, విన్నా అనుకునేవాణ్ణి. భయపడేవాణ్ణి. కాని భగవత్ ప్రేరణవల్ల కావచ్చు నాకు చదివే అదృష్టం కలిగింది. ఇన్నాళ్ళూ నేను ఆలోచించిన విధానం సరికాదని తెల్సుకున్నాను. అర్థంచేసుకోవటంవేరు- విశేషార్థం తెలుసుకోవటంవేరు- ఇంకా ఎంతో లోతులకు వెళ్ళి తరచి తరచి తెలుసుకోవటంవేరు. ఇందులో మొదటిది ముఖ్యం. అది దొరికే సందర్భం కలిగితే వదలకుండా గ్రహించినట్టయితే తరువాత మెట్లు ఎక్కడానికి అదే ప్రయత్నం అవుతుంది. నాకు ఎంతో తెలుసు అని వ్రాయలేదు ఈ గేయమాల. ఇది పూర్తిగా భగవద్గీతార్థాన్ని అందించలేక పోవచ్చు- కాని భగవద్గీత మీద విశ్వరూపంలా పెరిగిన భక్తితో విరిశాయి పుష్పాలు. అవి మాలకట్టాను. మా అన్నగారు శ్రీ సత్యనారాయణగారు చూచి, చదివి, తగు సూచనలుచేసి నాకు మరింత ప్రోత్సాహాన్ని కలిగించారు. నాకు గురుతుల్యులైన శ్రీ శ్రీరామగిరి రామచంద్రరావుగారు అడ్వకేట్, శ్రీ ఎం. ఎస్. కె. శాస్త్రిగారు అడ్వకేట్, శ్రీ సి. ఎన్. బాబుగారు అడ్వకేట్, శ్రీ అక్కిరాజు రమాపతిరావుగారు రిసెర్చి ఆఫీసరు తెలుగు అకాడమి, శ్రీ వడ్లమాని సోమసుందరంగారు డిప్యూటీ తహశీల్దారు విజయనగరం,మరియు శ్రీమతి బి.రాజేశ్వరీభగవాన్‌గారు అందించిన ప్రోత్సాహ ఫలితమే ఈ గేయమాల. వారికి నేనెంతో కృతజ్ఞుడను. నాకు సహకరించిన పెద్దలు శ్రీ పేరి సుబ్బారావుగారు, శ్రీ పఠానేని రామచంద్రరావుగారు, శ్రీ కళ్లె సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మొదలయిన సుందర బృందం

సభ్యులందరికీ నమస్కారములు. ఈ గేయమాల వెలువడుటకు నాకు సహాయపడిన సహృదయులకు నమస్సులు.

మిత్రుడు, శ్రీ కోకా సత్యనారాయణరావుగారు అడ్వకేట్ శ్రీ స్వామి రంగనాథానంద్‌గారి పరియ భాగ్యం కలిగించినారు. వారికి నేను సర్వదాకృతజ్ఞుడను.

ఈ గేయమాల ప్రప్రథమంగా దిల్‌సుక్‌నగర్ మారుతీమందిర్‌లో గానం చేయించిన శ్రీ కృష్ణస్వామినాయుడుగారు, శ్రీ కిషన్‌సింగ్‌గార్లకు నా నమస్సులు.

పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ శ్రీనివాసరావుగారు ఎంతో అందంగా ముద్రించి అనుకున్న సమయానికి ముందుగానే గేయమాల అందించినందుకు వారికి నా ఆశీస్సులు.

విధేయుడు
సూరంపూడి రాధాకృష్ణమూర్తి
17-12-1980

"ఆమని"
16-11-418/3/1
దిల్‌సుక్‌నగర్
హైదరాబాదు-36



20-12-1980న రామకృష్ణమఠంలో భగవద్గీత గేయమాల స్వామి రంగనాథానంద ఆవిష్కరించి ప్రథమ ప్రతిని గౌ॥ శ్రీ అల్లాడి కుప్పుస్వామి (ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి) గారికి అందజేసినారు. ప్రక్కనున్నది రచయిత సూరంపూడి రాధాకృష్ణమూర్తి.

# గీతా నవనీతం

ఆలరుపసిండి కంకణములందెలు మువ్వలు రావిరేకసం
కుల పులిగోరు తాయెతులు కుప్పెడపు న్మొలనూలు మద్దికా
యలుగల నందనందను దిగంబరు జారు కటీ తటోజ్జ్వలున్
విలసితనీలదేహు నవనీత హరుండగు బాలుగొల్చెదన్-

వెలగపూడి వెంగనామాత్య కృష్ణ కర్ణామృతాం
ద్రానువాదము.

బాలకృష్ణుడు వెన్నలు దొంగిలించేవాడు. తనదరిజేరిన వారిని ఒకదరి జేర్చేవాడు. వెన్నెలలు కురిపించేవాడు. ఆయన గీతామృత నవనీతాన్ని లోకానికి ప్రసాదించాడు.

మానవ జీవితం నిరంతర సంఘర్షణమయం. ఈ ఘర్షణలన్నిటినీ తొలగించి హృదయానికి స్వాస్థ్యాన్ని చిత్తానికి శాంతిని కలిగించేది గీతామృతం. అందుకే గీతను అద్వైతామృత వర్షిణి అన్నారు.

యుగయుగాలుగా భారతీయాత్మను ఎంతగానో ప్రభావితం చేస్తున్నది భగవద్గీత. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత కలిసి ప్రస్థానత్రయం. త్రిమతాచార్యులు గీతా వ్యాఖ్యానాలు చేశారు. ఆధునికులలో బాలగంగాధర తిలక్ తన గీతా వ్యాఖ్యానంతో భారతీయాత్మను ప్రబోధించాడు.

భగవద్గీత అనగానే కేవలం ముముక్షువులకే ఉద్దేశితమైంది అనుకో కూడదు. నిత్యజీవితంలో ఎదురయ్యే అనేక సమస్యలకు పరిష్కారం బోధించగలదు గీత.

అందుకే చి. సూరంపూడి రాధాకృష్ణమూర్తి 'ఇహ పరములకిది బంగరు బాట' అన్నాడు. పదిహేనో శతాబ్దంలో వేంకటశైల నాయకుని తన సంకీర్తన వాఙ్మయ కైంకర్యంతో మెప్పించిన అన్నమాచార్యుల కుమారులు పెద అరుమలయ్య భగవద్గీతకు వాడుక భాషలో తాత్పర్యం వ్రాశారు. నలుగురికీ అందాలనే ఆయన ఆశయం.

ఎంత సరళాతి సరళంగా ప్రచారంచేస్తే, సామాజిక జీవనానికి అంత ప్రయోజనం సిద్ధిస్తుందనీ మేలు కలుగుతుందనీ మా రాధాకృష్ణమూర్తి ఆశయం. సర్వోపనిషత్సారమైన భగవద్గీతను సులభశైలిలో చిన్నచిన్న మాటలతో చెప్పడం కష్టం. వేదాంత విషయాలకు వేదాంత పరిభాషతప్పదు. అయినాసాధ్యమైనంత వరకు తన శక్తియుక్తులున్నంత వరకు, నలుగురూపాడి నలుగురూ విని భగవద్గీత పరమార్థాన్ని తెలుసుకోవాలనే దృష్టితో ప్రచారం కావాలనే కోరికతో గేయమాలగా రూపొందించాడు భగవద్గీతను రాధాకృష్ణమూర్తి.

ఇతిశమ్

హైదరాబాదు.
వైకుంఠ ఏకాదశి
18-12-1980

అక్కిరాజు రమాపతిరావు

# శ్రీమద్భగవద్గీత

## (గేయమాల)

-: 1 వ అధ్యాయము :-

## -: అర్జున విషాదయోగము :-

వేదసారమిది భగవద్గీత
ఇహపరములకు బంగరుబాట
ఆదిదేవుడగు నారాయణుడు
ముదమున పార్థునకుపదేశించెను.

ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమున
పోరుకు నిలచిన నాకురువీరుల
పాండునందనుల వివరములన్నీ
అరమరికుంచక తెలుపుమునాకు

అడిగిన కురుపతి ధృతరాష్ట్రునకు
సంజయుడంతట తెలిపె విశదముగ
దుర్యోధనుడట గురువును చేరి
పలికిన పలుకులు వినిచెను రాజుకు

ఓ గురుదేవా! ద్రుపద పుత్రుడు
మీ శిష్యుడట ముందర నిలచి
బుద్ధికుశలుడై పాండవసేనల
పొందుగ నిలపిన తీరునుచూడుడు

భీమార్జునులతొ సమమగు వీరులు
అస్త్రశస్త్రముల ఈడగువారు
ద్రుపదుడు విరటుడు యుయుధానుడును
ఎందరొ యోధులు అందు నిలచిరి

దృష్టకేతుడు చేకితానుడు
కుంతిభోజుడు కాశీరాజు
పురుజిత్తుండెను శైబ్యుడుగలడు
బలసంపన్నులు యోధులు గలరు

॥వేదసార॥

విక్రముడతడు యుధామన్యుడు
వీరవతంసుడు ఉత్తమౌజుడు
సుభద్రతనయుడు ద్రౌపదిసుతులు
మహారథులు వీరందరుదేవా !

భూసురోత్తమా ! నాసేనలకు
నాయకులగు వారందరతెలిపెద
యుద్ధచతురులు వీరపుంగవులు
మీరు-భీష్ముడు-కర్ణుడు-కృపుడు

అశ్వత్థామయు భూరిశ్రవుడు
వికర్ణుడున్ను సమర్థులెందరో
యుద్ధమునందు వీరవతంసులు
విజయలక్ష్మిని అందగతగుదురు

మనబలగముల యుద్ధచతురులు
నాకొరకై తమ ప్రాణములిడెదరు
భీష్మ రక్షణలో చాలినసైన్యము
భీమరక్షణలో చాలనిబలములు

సేనలో తమ తమ స్థానములందు
నిలచి భీష్మునకు అండగనుండి
ఆహవభూమిలో అమితోత్సాహము
నిండగపోరుడు విజయలక్ష్మికై

కురు-పాండవులకు తాత భీష్ముడు
కురువంశమున వృద్ధుడు అతడు
సింహనాదముతో శంఖమునూదెను
ముదముగొలుపగా కౌరవరాజుకు

॥వేదసారమిది॥

మిగిలినయోధులు శంఖము-భేరులు
తప్పెట-పణవము-గోముఖమ్ములు
మ్రోయించిరి ఆ ధ్వనులన్నియును
దిక్కులందున పిక్కటిల్లెను

శ్వేతాశ్వములను పూన్చినయట్టి
మహారథమున మధుసూదనుడును
పాండునందనుడు దివ్యశంఖములు
ఊదిరి అదిరెను దిక్కులన్నియు

పాంచజన్యమును కేశవుడూదెను
దేవదత్తమును పార్థుడు ఊదగ
భీమకర్ముడగు వృకోదరుండు
గొప్పశంఖమగు, పౌండ్రము నూదెను.

కుంతీసుతుడు యుధిష్ఠిరుండు
అనంత విజయము పూరించగను
నకులుడు సుఘోషమను శంఖమును
సహదేవుడు మణి పుష్పకమూదిరి

మేటి విలుకాడు కాశీరాజు
ఆజివీరుడు ఆ శిఖండియు
దృష్టద్యుమ్నుడు విరాట రాజు
ఓటమి యెరుగని సాత్యకి ద్రుపదుడు

ద్రౌపది పుత్రులు సుభద్ర సుతుడు
వీరులుచేసిన శంఖఘోషలు
సుయోధనాదుల గుండె లవియగా
భూమ్యాకాశములందు నిండెను

॥వేదసారమిది॥

ఓ కురురాజా ! పార్థుని రథము
కపిధ్వజముతో వెలయుచునున్నది
గాండీవము తన కరమున నిలిపిన
పార్థుడు పలికెను నారాయణునితొ

అచ్యుత ! నీవు నాపై దయగొని
నిలుపుము రథమును సేనలనడుమన
యుద్ధాసక్తుల కలయచూతును
ఎవరితొ పోరుట తెలియును నాకు

దుష్టబుద్ధి ఆ దుర్యోధనుని
సంతుష్టుచేయగ పోరుకుసాగిన
వారలచూతును అనశ్రీకృష్ణుడు
ఉత్తమరథమును నిలిపెనునడుమ

జగన్నాథుడు దివ్యరథమును
భీష్మ-ద్రోణుల ముందరనిలపి
"అందరగాంచుము కురుసేనలివి"
పలికెను పార్థునితోనంతటను

ఉభయ సేనల పార్థుడు చూచెను
తండ్రులు-గురువులు-మేనమామలను
తాతల-మిత్రుల-సోదరులందర
తనయుల-మనుమల-హితకాంక్షులను

కుంతీసుతుడు బంధు-మిత్రులను
కన్నులజూడగ కదలిపొంగువలె
విషాదమ్ము తన హృదిలోపొంగగ
దుఃఖముతో పరమాత్మతొ పలికెను

॥వేదసారమిది॥

నా హృదయమున పదిలమునున్న
ఓ శ్రీకృష్ణా ! యదుకుల భూషణ
బంధుమిత్రులను యుద్ధోన్ముఖులను
చూచిన స్థిమితము గోల్పోయితిని

మేనువణకుచు గగురుపడుచును
గొంతులోతడి అది ఆరిపోవుచు
గాండీవమునా చేత నిలువక
చేతలుడిగితిని గనుమిది కృష్ణా !

నిలుచుటనాకిక సాధ్యముకాదు
ఆలముచేయగ కోరికలేదు
కేశవ ! మనసు నిలకడదప్పెను
అశుభసూచనలు కనపడుచున్నవి

ఆలములో నావారలజంపి
ఆనందించగ మనసేలేదు
విజయమునందగ మదిలోకోరను
రాజ్యకాంక్షయిక లేనేలేదు

ఓ గోవిందా ! సుఖసౌఖ్యములు
రాజ్యముకోరితి నావారలకై
వారందరుయిట పోరుకు దిగిరి
ప్రాణములన్న తీపినివదలిరి

మధుసూదన ! నా గురువులు వీరు
తండ్రులు-పుత్రులు-తాతలు-మామలు
మనుమలు వీరిలో మేనమామలు
బావమరదులు అందరుగలరు

ముల్లోకములను ఏలగయిచ్చిన
చంపను వీరిని కావున కృష్ణా !
భూలోకమును ఏలుటకొరకై
చంపను నేనని వేరుగనుడువన

ధార్తరాష్ట్రులను చంపినమనకు
ఏమిప్రీతిమరి కలుగునువినుము
ఆతతాయిలగు దుష్టబుద్ధులను
చంపుటకూడ పాపమేకదా !

ఆశాపాశులు ఈకౌరవులు
పాపకార్యములు మానగలేరు
కానీ జ్ఞానము కలిగినమనము
పాపకార్యముల నాచరించుటెటు ?

కులక్షయమ్మగు కులధర్మములవి
కూలిపోవును హతమగుమతము
దుష్టపథమును కులస్త్రీ త్రొక్కిన
వర్ణసంకరము జరుగుట నిజము

వంశాచారము మంటగలియును
వంశముకంతకు నరకముతప్పదు
పితృదేవతలు గుర్తువుందరు
పిండోదకములు అసలే విడువరు

కులధర్మములు నశించిపోవును
వంశనాశము జరిగిపోవును
కులాచారములు క్షీణించగను
సర్వమునాశము అయినటులేకద !

॥వేదసారమిది॥

ధర్మముపీడిన మనుజులందరు
నరకవాసమున స్థిరముగనుందురు
అనుభవిందుము ఓజనార్దనా !
ధర్మహానిమరి చేయుట తగునా ?

రాజ్యసుఖములు మదిలోతలచి
స్వజనుల-బంధుల చంపుటకొరకై
తీరుగపోరగ సమకట్టితిని
ఆహా ! ఎంతటి పనికొడిగట్టితి

ఓ శ్రీకృష్ణా ! అంతటి ఘోరము
రాజ్యకాంక్షతో చేయబూనను
అస్త్రముపట్టక నిలచిననన్ను
వారు అంతము జేసినమేలు

గుండెలనిండిన దుఃఖముతోను
గాండీవమది చేయిజారగా
కూలబడెను ఆకిరీటిరథమున
అని సంజయుడు తెలిపెనురాజుకు.॥వేదసారమిది॥

## 2వ అధ్యాయము

# సాంఖ్యయోగము

దుఃఖమునిండి మనసుకలతపడి
దయతోనిండిన చిత్తముగలిగిన
పార్థునితో శ్రీకృష్ణుడు పలికిన
పలుకులువినిచెను సంజయుడంత

పాండునందనా ! పామరమయిన
మనోవ్యాకులము ఏలకలిగెను
స్వర్గప్రాప్తికి భంగమయినది
దుర్యశమైనది నీకెటు కలిగెను

పిరికితనమును పారద్రోలుము
హృదయదుర్బలత నెట్టివేయుము
అన, పార్థుడు తన బావతొ పలికెను
గురువుగ కృష్ణుని భావించుచును

మధుసూదన ! ఈ పూజనీయులు
భీష్మ-ద్రోణులతొ పోరుట ఎట్లు ?
గురువుల-పూజ్యుల చంపుటకంటె
బిచ్చమెత్తుటె ఉచితమయినది

జయాపజయములు తెలుపగలేము
రక్తసిక్తమై లంభిచుసిరులవి
ఏదిశ్రేష్ఠమో తెలియగనైతిని
చంపకూడని వారిని చంపన ?

కార్పణ్యముతో నిండిన మనసుతొ
ధర్మవిషయమున సందేహముతో
అడుగుచుంటిని ఏదిశ్రేయమో
నీశిష్యుడను ఉపదేశింపుము

శత్రువులేక పుడమిపాలనము
సురాధిపత్యము దొరకినగాని
ఇంద్రియాలను బాధించెడి యీ
బాధతొలగెడి మార్గము తెలియదు

హృషీకేశ ! నేఆలముచేయగ
చాలదుమనసు అనిన పార్థునితొ
నవ్వుచుమాధవుడనిన పలుకులు
తేటతెల్లముగ తెలిపెసంజయుడు

॥వేదసారమిది॥

శోకించితివి తగనివారికై
బుద్ధివాదివై పలుకుచుంటివి
ఆత్మజ్ఞానులు దుఃఖించరు—విను
మనెడివారికై -గతజీవులకై .

నీవు-నేను ఈ రాజులందరు
జీవించనిదిన మన్నదిలేదు
భవితలో ఉండకపోవుటన్నది
లేదన్నదినే నన్నది వినుమా !

శైశవ-యౌవ్వన-వార్ధక్యములు
కలిగినట్టుగ వేరొకతనువు
జీవికి దొరకును కావున జ్ఞానులు
ఈ విషయమున మోహమునందరు

ఇంద్రియాలకు శబ్దస్పర్శలు
శీతోష్ణములు సుఖదుఃఖములు
వచ్చుచుపోయెడి అస్థిరమైనవి
ఓర్చుటనేర్వగవలయును పార్థా !

పురుషశ్రేష్ఠ ! విను ఏ మానవుని
శబ్దస్పర్శలు, స్పృశించనేరవొ —
సుఖదుఃఖములు, సమముగనెంచునొ
అట్టిధీరుడే మోక్షార్హుడయా !

లేనితనువుకు ఉనికిలేదని.
ఉన్న ఆత్మమరి లేక పోదని.
తత్వజ్ఞానులు నిశ్చయమ్మగ
రెంటి విషయము తెలియగనేర్చిరి

॥వేదసారమిది॥

సర్వజగత్తున నిండినయట్టి
పరమాత్మ శాశ్వతము ఓధనంజయా !
అవ్యయమయినది దానిని ఎవ్వడు
నాశముచేయగ చాలడువినుము

తనువున నిండిన ఆత్మశాశ్వతము
దానిని నాశము చేయగలేరు
భౌతికదేహము నాశనమగునది
యుద్ధముచేయగ సిద్ధముకమ్ము

జననమరణములు ఆత్మకులేవు
పుట్టినచోమరి గిట్టుటజరగదు
నాశనమన్నదిలేని ఆత్మఅని
తెలిసిన చంపుట చచ్చుట ఎక్కడ ?

ఆత్మనుచంపెడి వానిగతలచెదు
చంపబడెడి వా డతడనితలచెడు
వాడు యదార్థము తెలియగలేడు
చావదుఆత్మ చంపబడదయా !

మాసిచినిగిన వలువమార్చినటు
ఆత్మమార్చును తనువునువినుము
ఆత్మఛిద్రము చేయగబడదు
కాలదు-నానదు గాలికి లొంగదు

మారదు-ద్రవింప సాధ్యము కానిది
ఛేదించుటకు లొంగనిదాత్మ
సర్వవ్యాపకము శాశ్వతమైనది
స్థిరమైనది మరి సనాతనమ్మది

॥వేదసారమిది॥

దృష్టికిదొరకదు ఊహకు అందదు
మార్పుచెందనిది ఆత్మనితెలిసిన
తనువునాశము జరుగునుఅనుచు
చింతనొందుట తగదికనీకు.

ఆత్మకుపుట్టుట గిట్టుటకలదని
నీవుతలచిన నీ విషయములో
వంతనొందుట చింతిల్లుటది
ఎంతయుతగదు కుంతికుమారా !

పుట్టినవాడు గిట్టుట తథ్యము
గిట్టినవాడు పుట్టుట సత్యము
ధర్మాచరణము నీ కర్తవ్యము
చింతనువదలుట ఎంతయొ మేలు.

పుట్టకముందు ప్రాణులు ఎక్కడొ ?
పుట్టి మనుచుమరి కనబడుచుండును
మరణించిన మరి తెలియదు ఉనికి
కావున ఏల వంతనొందుట ?

ఆత్మను ఆశ్చర్యముతో నరయుచు
ఆశ్చర్యముతో వినుచు-నుడువుచు
అంతచేసియు ఎవ్వరుకూడ
ఆత్మయన్న మరి తెలియుటలేదు.

తనువుధరించిన జీవిని నీవు
చంపుటఎట్లని వంతనొందకుము
చంపుటనీకు సాధ్యముకాదు
క్షత్రియధర్మము తలనుధరించుము.

॥వేదసారమిది॥

క్షాత్రధర్మము ఎదిరిపోరుట
ఎదురుచూచెడిది నీకులభించెను
సంగ్రామంబన క్షత్రియులకును
తెరచివుంచిన స్వర్గద్వారము

ధర్మయుద్ధమున తలపడకున్న
కులధర్మముచెడి కీర్తినశించును
పాపివగుదువు నిందపొందెదవు
మరణముమించిన క్లేశము అదికద.

పోరుకు వెరచితివన్న నిందతో
వీరపుంగవులు గౌరవించరు
నీపగవారు పరిహసింతురు
ఎంతటిదుఃఖమొ ఆలోచించుము.

పగరగెలిచిన భువినేలెదవు
పోరునమడసిన స్వర్గమేగెదవు
కుంతికుమారా ! మనసుదిటవుతో
పోరుకునీవు సిద్ధముకమ్ము

సుఖదుఃఖములు గెలుపు-ఓటమి
లాభనష్టములు సమముగనెంచుచు
సంగ్రామమునకు సిద్ధముకమ్ము
ఎట్టిపాపములు నీదరిచేరవు

సాంఖ్యపద్ధతి ఆత్మతత్వము
ఉపదేశించితి ఇకమీదటను
యోగమార్గమును ఉపదేశించెద
కర్మబంధములు వీడగ పార్థా !

॥వేదసారమిది॥

కర్మయోగము అనుష్ఠించగ
నిశ్చలబుద్ధి అతిముఖ్యమయా !
చంచలమైన బుద్ధులు ఎన్నో
అనంతములుగనున్నవి అర్జున !

వేదరహస్యము నెరుగని వారు
అందునుడివిన స్వర్గ ఫలములను
మించిన ఫలము లేదను పలుకులు
పండ్లనీయని పుష్పసమములు

కోరికనిండిన స్వర్గాభిలాషులు
అల్పబుద్ధితో జన్మము, కర్మము
ఫలములనొసగే భోగైశ్వర్యము
అమరగనుడివెడి వాక్యమ్ములతో

భోగైశ్వర్యములందు నిలచిన
మనసుకు నిశ్చల బుద్ధికలుగదు
దైవధ్యానమున ఏకాగ్రతగల
బుద్ధికలుగనే కలుగదుపార్థా !

త్రిగుణాత్మకములు, వేదవాక్కులు
గుణభేదముల కతీతుడవగుము
సుఖదుఃఖములను భేదముగెలచి
ఆత్మజ్ఞానివి కావలెనీవు

యోగక్షేమమను చింతలుమరచి
స్థిరమగుచిత్తము కలిగియుండవలె
సౌఖ్యముకొరకై కర్మనుచేయుట
అన్నవాక్యములు శుష్కప్రియములు

॥వేదసారమిది॥

బావిఇచ్చెడి జలముల ఫలము
జలసమృద్ధమగు ప్రవాహమిచ్చును
అట్లేవేద సారములన్నీ
బ్రహ్మనిష్ఠుడగు వానిలోఇముడును

నీబాధ్యత అది కర్మాచరణము
ఫలితముపైన ఏమధికారము ?
కర్మఫలములకు కర్తవుకాకుము
కర్మలయందాసక్తిని విడువకు

ఓ ధనంజయా ! యోగనిష్ఠతో
అహమునువదలి కర్మనుచేయుము
కార్యసిద్ధియు కాకపోవుటయు
సమముగనెంచుట యోగమందురు

సమదృష్టితొ నిష్కామకర్మము
ఫలాపేక్షగల కామ్యకర్మముల
మొదటిదిమిన్న కావున అర్జున
నీవుదానినే ఆశ్రయించుము

సమత్వబుద్ధియె పాపపుణ్యములు
రెంటినితను వదలించుకొనునయా !
కామ్యముకోరని యోగముతెలియుము
కర్మకౌశలము, యోగమనబడును

ఫలితమువదలిన కర్మాచరణతొ
జ్ఞానమునెరిగిన మనుజులందరు
జన్మబంధముల బంధనమొందక
మోక్షపదవిని అందుచుందురు

॥ వేదసారమిది ॥

అజ్ఞానము నీ మదిలో తొలగిన
వినదగుబోధన లన్నిటియందు
వినినబోధనల వివరములందు
విరక్తినీవు కలిగియుందువు

పలుప్రసంగముల వినినబుద్ధియది
ఎపుడుచలింపక నిలచియుండునో
పరమాత్మధ్యానమున స్థిరముగ నిలచునో
అపుడు యోగము అమరునునీకు

అంతటపార్థుడు అడిగెకేశవుని
సమాధినున్న స్థితప్రజ్ఞుని
వివరములేమి? ఎటుమాటాడును?
ఏవిధినుండును? ఎటుమెలగునయా !

బదులు పలికెను భగవానుడు అట
పార్థా ! మనసున కోరికవదలి
ఆత్మయందుతన స్థిరచిత్తముతో
స్థితప్రజ్ఞుడు సంతుష్టినొందును

దుఃఖమునందు కలతజెందడు
సుఖములయందు పొంగిపోవడు
రాగము-భయము-క్రోధములన్నీ
వదలినమునియే స్థితప్రజ్ఞుడయా !

విషయములం దభిమానములేక
ప్రియాప్రియములు సంభవించినను
పొంగకక్రుంగక నుండెడివాని
జ్ఞానము అగునది స్థిరమగునట్టిది

॥వేదసారమిది॥

తాబేలుతన అవయవములను
ముకుళించినటు ఇంద్రియాలను
సుఖములకందక మరల్చుయోగి
అట్టిప్రజ్ఞయే స్థిరమయినదయా !

శబ్దాది విషయములుస్వీకరించనిచె
వాటియందలి వాసనవదలదు
పరమాత్మదర్శనము అయినచోయిక
ఎట్టివాసనలు మిగలవుపార్థా !

కుంతీనందన ! ఇంద్రియాలవి
బలవత్తరములు కావున, బలముగ
నిగ్రహించు, ప్రతి మనుజునిలాగును
విషయవాంఛల, విద్వాంసునిసైతము

ఇంద్రియాలను అన్నిటినీతను
అదుపులోనుంచి సాధకుడెపుడు
స్థిరచిత్తముతో నాపైమనసుతొ
ఉండిన, ఆతని జ్ఞానముస్థిరమగు.

విషయచింతనతొ ఆసక్తిజనించును
దానితొఅతనిలొ కోరికపుట్టును
కోరికవల్లను కోపముపుట్టును
అదిమూలము మరి దానివల్లను

అవివేకమది మదిలోనిండును
అవివేకముతో మరపుకలుగును
మరపుతొబుద్ధి నాశముఅగును
బుద్ధినశించిన పూర్తివినాశము

॥వేదసారమిది॥

ఇంద్రియ నిగ్రహమన్నది లేనిచో
బుద్ధి, వివేకము కలుగదు; నిజము
ఆత్మచింతనయు అసలేకలుగదు
శాంతిలభించదు సుఖముఅందదు

విషయములందు చరించునట్టి
ఇంద్రియాలపై మనసు నిలచిన
అది వివేకపు త్రోవమార్చును
పెడత్రోవబట్టిన నావఅగునది

వీరపుంగవా? ఇంద్రియాలను
జయించి నిలచిన మనుజుని జ్ఞానము
నిశ్చలమయినది నిగ్రహంబున
కలిగెడిసుఖము నిజమగుసుఖము.

ఇంద్రియమ్ముల నదుపులోఉంచుట
అన్నిటికన్నా కష్టముసుమ్మీ
అదిసాధించుట అలవడి నంతనె
దీపకాంతివలె జ్ఞానము భాసిలు

అజ్ఞానులు అగు సామాన్యులకు
రాత్రి సమయము జ్ఞానులపగలు
జ్ఞానరహితుల దివాసమయము
రాత్రిఅగునుమరి జ్ఞానులందరికి

నదీప్రవాహము లెన్నికలసియు
సాగరమందు ఉనికితెలియవు
అదేవిధముగ భోగ్యవాసనలు
బ్రహ్మనిష్ఠునిలో అణగిపోవును

॥వేదసారమిది॥

ఆశాపాశము లన్నిటి త్రెంపి
చపలత్వమునకు లొంగిపోవని
నేను, నాది అను అహమును విడచిన
శాంతిస్థితిని పొందినవాడగు

దానిని అందురు ఇంద్రకుమారా!
బ్రాహ్మిస్థితియని, దానినిపొందిన
మోహముతొలగును అంత్యమునైనా
ఆస్థితిపొందిన బ్రహ్మనిర్వాణము. ॥వేదసారమిది॥

## 3వఅధ్యాయము

# కర్మయోగము

ఓ జనార్దనా? నీదుపలుకులు
కర్మకన్నను జ్ఞానమమిన్నని
తెలుపుచున్నవి అయినను నన్ను
ఘోరకర్మను చేయమందువా?

విరుద్ధమయిన విషయపరంపర
కలవరపరచెను నా మనసంతయు
నిశ్చయముగ నాకేదిక్షేమమో
నిర్ణయించి బోధింపుము దేవా!

అనవిని, కేశవుడనెనుపార్థునితొ
జ్ఞానయోగము సాంఖ్యులకొరకు
కర్మయోగము యోగులకొరకు
రెండుమార్గములు తెలిపితితొలుత

కర్మలువదలి నిష్కర్మస్థితి
పొందితిననుటది పొరబాటుసుమా
కర్మత్యాగమున మోక్షసిద్ధిని
పొందుటజరగదు కుంతికుమారా!

కర్మాచరణము చేయకపోవుట
సాధ్యముకాదు జగతిని పార్థా!
సహజమయినది ప్రకృతిసిద్ధము
కర్మతాపొందు ఉండునుఇలలో

ఇంద్రియమ్ములను అదుపులోనుంచుచు
ఇంద్రియలోలత మదిలోవిడువని
మనుజుడుఇలలో వేషధారియగు
కర్మయోగియన పూర్తినిగ్రహుడు

ఓ ధనంజయా! మనసుచేతను
ఇంద్రియమ్ములను నిగ్రహించి మరి
ఆసక్తిని వదలి కర్మయోగమును
ఆచరించెడివాడే శ్రేష్టుడు.

నీ నియమితమగు కర్మనుచేయుము
కర్మమానుటకన్నను పార్థా!
చేయుటశ్రేష్టము-కర్మలుచేయక
దేహయాత్ర సిద్ధింపనేరదు

యజ్ఞార్థమగు కర్మలుతప్ప
ఇతరకర్మలలొ బంధనముండును
కావున యజ్ఞ కర్మలునీవు
లెస్సగచేయుము మోహమువదలి

ఇష్టకామ్యములనిచ్చునుయజ్ఞము
అభివృద్ధికి అది దోహదమెంతో
అనినుడివెనుగా బ్రహ్మదేవుడు
ఆదికాలమగు సృష్టిసమయమున

॥వేదసారమిదీ॥

దేవతలందరు ప్రీతినొందెడి
యజ్ఞమ్ములను మీరు చేసిన
మీలోమీకు స్నేహము విరసి
శ్రేయముకలుగును మీకందరకు

యజ్ఞమువలన పూజలనందిన
దేవతలిత్తురు భోగములెన్నో
సేవలుతిరిగి వారుపొందనిచో
చోరత్వముగా మిగులునుకాదా !

యజ్ఞప్రసాదము తినుటఉత్తమము
దోషముఅంటదు, పాపముకలుగదు
దేవతలకు తము నివేదించక
తినువారందరు పాపాత్ములయా !

ప్రాణికోటిజనియించు అన్నమున
అన్నముదొరకును వానలుకురిసిన
ఆవానలు ఇల కురియుయజ్ఞమున
యజ్ఞముపొసగును సత్కర్మలతో

సత్కర్మకలుగును వేదమువలన
క్షరముకాని పరబ్రహ్మమెవేదము
కర్మలతోనే యజ్ఞముపొసగును
బ్రహ్మమునెలకొను యజ్ఞమునందే.

చక్రభ్రమణమిది దీనితొకలసి
తిరగనివాడు ఇంద్రియలోలత
ఆవహింపగను పాపాత్ముడగు
అట్టిజీవనము వ్యర్థముపార్థా!

॥వేదసారమిది॥

ఆత్మయందునే సుఖములుపొందుచు
తృప్తినిపొంది సంతోషించెడి
ఆత్మజ్ఞానికిక చేయదగినది
ఏదియులేదు కుంతికుమారా !

ఆత్మజ్ఞానికి ఇలలోకర్మల
చేసినఫలితము, వదలినదోషము
అంటదు, అతడు సర్వభూతముల
నాశ్రయించగ పనియేలేదు

ఫలాపేక్షను లేనివాడవై
చేయగ దగిన కర్మనుచేయుము
ఆసక్తినివదలిన కర్మలవలన
మోక్షమునందును మనుజుడుఇలలో

నిష్కామకర్మతో మోక్షమునందిరి
జనకుడుమొదలగు పుణ్యమూర్తులు
అదేమార్గమున జనులునడవగ
కర్మనుచేయగ వలయునునీవు

శ్రేష్ఠులు-పెద్దలు నడచినత్రోవనె
సామాన్యులును నడచుటసహజము
అదినడవడియని మంచిమార్గమని
తెలియగ,జగతిని చెడువిడచెదరు

మూడులోకముల చేయవలసిన
కర్తవ్యము నాకేదియులేదు
అందనిదెరుగను అందితిసర్వము
అయినను కర్మలొవర్తించెదను

॥వేదసారమిది॥

కర్తవ్యము నే నిర్వర్తించుట
కర్మాచరణతో త్రోవచూపుటే.
నేనటుచేయక ఉపేక్షచేసిన
మనుజులునన్ను అనుసరింతురు

ఉదాసీనముగ నేనుండినచో
మనుజులందరు కర్మవిముఖులై
లోకములన్నీ కలతచెందగ
కలిగెడిక్షోభకు కారణమగుదును

ఫలములెంచి అజ్ఞానులుకర్మను
చేయుచున్నటు, జ్ఞానులుమాత్రము
ఫలములువదలి లోకహితముకై
కర్మాచరణము చేయవలెనయా !

జ్ఞానిఎన్నడూ ఫలాసక్తుల
బుద్ధిమార్చగ ప్రయత్నించక
తనఆచరణతో అనుసరించునటు
చేయగవలెను అజ్ఞానులను

సత్వము-రజస్సు-తమోగుణముల
ప్రకృతివలననె కర్మలుజరుగును
అహంకారమున మూఢత్వముతో
కర్తలుతామని తలపోయుదురు

గుణముల,కర్మల విభజనతెలిసిన
తత్వవేత్తమరి గుణములన్నవి
గుణములపరిధిలో వర్తించెనను
కర్మలయం దభిమానము పెంచడు

॥వేదసారమిది॥

ప్రకృతిగుణముల మౌఢ్యమునిండి
గుణకర్మల ఆసక్తి పెంచుకొని
కర్మలు చేసెడు అజ్ఞానులను
కర్మవిముఖులుగ చేయగరాదు

సర్వకర్మలను ఈశ్వరపరముగ
ఫలితములన్నీ పరమాత్మునివని
ఆశలువదలి మమతలుత్రెంచి
చిత్తశాంతితో పోరుసలుపుము

అసూయవిడచి నాశాస్త్రమును
శ్రద్ధగమదిలో తలచుకొనుచును
ఆచరించగను మానవులందరు
కర్మబంధముల విముక్తులగుదురు

నాశాస్త్రమును ద్వేషించుచును
అనుసరించని వారందరును
బుద్ధిహీనులు జ్ఞానహీనులై
నష్టపడినటు తెలియుమునీవు !

జన్మాంతర సంస్కారమునకును
తగినట్టుగనే జ్ఞానియుమెలగును
అటులేనడచును భూతగణములు
కావున నిగ్రహ మేమిచేయును ?

ఇంద్రియమ్ముల సహజములయిన
రాగద్వేషములు కలిగియుండును
వాటికిలొంగక నిలబడవలెను
రాగద్వేషములు రెండుశత్రువులు

పరధర్మమది కడుఅపాయము
స్వధర్మమేమరి శ్రేష్ఠమయినది
స్వధర్మపరునిగ చావుమేలగు
పరధర్మమతి భయంకరమయా !

పార్థుడుఅడిగెను నారాయణుని
ఓ వార్ష్ణేయా ! పాపకర్మలకు
ప్రేరణఏల కలుగుచున్నది ?
ప్రోద్బలమేల అందుచుండవలె ?

అంతట శ్రీభగవానుడు పలికెను
పార్థా! తెలియుము దానికి హేతువు
రజోగుణమున పుట్టెడికామము
కామముమారును క్రోధముగాను

విజయా! వినుము కామమన్నది
తృప్తినొందుటది సాధ్యముకాదు
మహాపాపముల కాలవాలమది
మోక్షపథమునకు శత్రువుఅదియే

అగ్నినిధూమము కప్పినరీతి
అద్దపుకాంతి ధూళిమాపినటు
గర్భముమాయతో కమ్మినతీరుగ
ఆత్మజ్ఞానమును కమ్మునుకామము

కుంతికుమారా ! కామమన్నది
అనలముమాదిరి తృప్తిలేనిది
అదియేజ్ఞానికి శత్రువయినది
ఆశతోనిండి జ్ఞానముమ్రింగును

॥వేదసారమిది॥

మనసు-బుద్ధిని ఇంద్రియమ్ములను
ఆవరించుకొని కామముండును
వక్రమార్గమున మనుజునినడపును
ఆత్మజ్ఞానమును కప్పివేయును

ఇంద్రియమ్ములను నిగ్రహించుకొని
జ్ఞానమ్మునుమరి విజ్ఞానమును
నాశము చేయు కామమునిపుడే
సంపూర్ణముగ వదలివేయుము

దేహముకన్న బల మింద్రియములు
వాటినిమించిన బలముమనస్సది
మనసునుమించిన బలముబుద్ధిది
బుద్ధినిమించిన బలమీఆత్మ.

బుద్ధినిమించి అతీతమయినది
ఆత్మనితెలిసి మనసువశముతో
గెలువగకష్టము అయినశత్రువగు
దుష్టకామమును దునుమాడుమయా !

॥వేదసారమిది॥

## 4 వ అధ్యాయము

# జ్ఞాన యోగము

నాశరహితమగు యోగశాస్త్రము
తెలిపితిలోగడ ఆదిత్యునకు
భాస్కరుడంతట మనువుకుతెలిపెను
మనువుతెలిపెను ఇక్ష్వాకునకు

పరంపరగను బోధింపబడి
వచ్చుచున్న ఈ యోగమార్గము
రాజఋషులుమరి గ్రహించినారు
కాలగతినది మరుగునపడెను.

నాభక్తుడవు మిత్రుడగుటచె
గొప్పదయినమరి రహస్యమైన
పురాతనమ్మగు యోగశాస్త్రము
తెలిపితినీకు పాండునందనా !

లోకచక్షువగు వివస్వంతుడు
సృష్టితో కూడి పుట్టెనుకాదా !
ఇప్పటినీవు అప్పటిరవికి
బోధించుటది అబ్బురముసుమా !

అడిగిన విజయుని చూచి కేశవుడు
అర్జున ! ఎన్నో జన్మలు మనకు
గడచిపోయినవి నీకు తెలియదు
తెలియునునాకు నుడివెదవినుము

నాశరహితుడను ఈశ్వరుడును. నే-
సర్వభూతముల ఏలికనేను
నాప్రకృతినే వశము చేసుకొని
మాయాశక్తితొ అవతరింతును

ధర్మముక్షీణించెడి సమయముల
అధర్మమ్మది ఎదుగుసమయమున
సృజించుకొందును ఇలలోపార్థా !
అవతరించెదను అపుడేనేను.

సాధుపుంగవుల సంరక్షణకై
దుష్టశక్తులను దునుమాడుటకై
ధర్మమునిలపగ యుగయుగములలో
అవతరించెదను అవతారములవి.

॥వేదసారమిది॥

దివ్యములయిన నామహిమలను
తీరుగవినిన వారందరును
పునర్జన్మను పొందరువినుము
నన్నుచేరెదరు నాభక్తులయి

రాగము-భయము కోపమంతయు
విడచి నన్ను మరి ఆశ్రయించిన
వారందరును జ్ఞానతపసుచే
నాస్వరూపమున చేరుచుందురు

ఏమార్గములో ననుభజియింతురో
ఆమార్గమున అనుగ్రహింతును
వివిధరీతుల నామార్గమును
అనుసరించి నను చేరుచుందురు.

కర్మఫలముల అపేక్షించుచు
మానవులిలలో పలుదేవతలను
ఆరాధింతురు, మనుజలోకమున
శీఘ్రముగా ఫలసిద్ధిసాధ్యము

గుణకర్మలను గుర్తించుచును
చాతుర్వర్ణములను సృజియించితి
కర్తనునేనే అయినాతెలియుము
నాశరహితునిగ, అకర్తగాను

కర్మలునన్ను అంటవుపార్థా !
ఫలములయందాపేక్షనెరుగను
అటులేనన్ను తెలిసినవారు
కర్మబంధముల విముక్తులగుదురు.

॥వేదసారమిది।

ముముక్షువులు యీ సత్యము నెరిగి
చేసిరికర్మలు నిష్కామముతో
అమార్గమున నడువుము పార్థా !
నిష్కామకర్మను చేయుము నీవు

కర్మఎట్టిదో? అకర్మ ఏదియొ ?
తెలియకపోయిరి పండితులయినా
దేనినితెలిసిన బంధముతొలగునొ
తెలిపెద విను మది కర్మరహస్యము

శాస్త్రవిహితమగు కర్మలుఏవో
శాస్త్రనిషిద్ధము అగు కర్మేదియొ
కర్మరహితమన తెలియగవలెను
కర్మతత్వము అగాధమయినది.

కర్మనుచేయుచు అకర్మనుచూచెడి
అకర్మయందున కర్మనుగనెడి
మనుజుడువివేకి, యోగయుక్తుడు
సకలకర్మలను చేసినవాడగు

కామ్యము సంకల్పములవిలేక
ఏమానవుని సమస్తకర్మలు
జ్ఞానాగ్నిలోమరి దహింపబడునో
అతనినిపండితు డందురువిజ్ఞులు

ఫలితమువదలి తృప్తితోడను
దేనినితాను ఆశ్రయించక
చేసినకర్మలు నిష్కర్మలగు
కర్మలుచేసియు చేయనివాడగు

॥వేదసారమిది॥

ఆశను మనసును ఇంద్రియాలను
నిగ్రహించి, తను గ్రహించుటన్నది
పూర్తిగవదలి తనువుతొచేసిన
కర్మలతోమరి పాపములంటవు

కోరకవచ్చిన తృప్తినిపొందుచు
ద్వంద్వాతీతుడు మత్సరమెరుగక
సిద్ధి, అసిద్ధియు ఒకటిగనెంచే
మనుజుని కర్మలు బంధించవయా

ఆసక్తిలేకను భవబంధముల
విముక్తుడై మరి గురిగలమనసుతొ
యజ్ఞభావనతొ పరహితమెంచి
చేయుకర్మలవి కరగిపోవునవి

హోమసాధనలు హోమద్రవ్యము
హోమాగ్నియును చేసెడివాడు
చేయబడునది బ్రహ్మముఅనుకొను
యజ్ఞకర్మతో చేరును బ్రహ్మము

కొందరుయోగులు దైవారాధన
పురస్కరించుకు యజ్ఞముచేతురు
మరికొందరిల జీవబ్రహ్మమును
బ్రహ్మాగ్నిలొమరి హోమముచేతురు

కొందరు చెవియు ఇంద్రియాలను
నిగ్రహమనెడి అగ్నియందున
మరికొందరు శబ్దాదివిషయములు
ఇంద్రియాలను అగ్నిలొ వ్రేల్తురు

॥వేదసారమిది॥

కొందరు ఇంద్రియ వ్యాపారములను
ప్రాణులకర్మల నన్నిటిని మరి
జ్ఞానమునిండిన మనోనిగ్రహము
అనెడి అగ్నిలో హోమముచేతురు

ద్రవ్యాదులతో యజ్ఞముచేయుట
తపోయజ్ఞము మరియొకయజ్ఞము
యోగముయజ్ఞముగా నెంచబడె
స్వాధ్యాయయజ్ఞము చెప్పబడినది

ప్రాణాయామము అభ్యసించిమరి
ప్రాణవాయువున అపానవాయువు
దానిలోతిరిగి ప్రాణవాయువును
హోమముచేయుచు నుందురుకొందరు

మితభుక్తముతో మరికొందరిల
ప్రాణవాయువులు వాటియందునే
వ్రేల్చుచుయజ్ఞము చేయుచుందురు
పాపమునశించి పుణ్యమందెదరు

యజ్ఞముచేసి మిగిలినశేషము
తినినచేరుటది పరబ్రహ్మమును
అట్టియజ్ఞము చేయకపోయిన
ఇహసుఖమేది? పరసుఖమెట్టిది?

ఎన్నో విధముల యజ్ఞములిటుల
వేదమునందు తెలుపబడినవి
అన్నిటియందు కర్మప్రధానము
అదితెలిసిన, నువు విముక్తుడగుదువు

॥వేదసారమిది॥

ద్రవ్యాదులతో చేయుయజ్ఞము
మించినయజ్ఞము జ్ఞానయజ్ఞము
సర్వకర్మల ఫలమదికాదా
జ్ఞానమునందు లీనములగుట

కావున, పార్థా! జ్ఞానమునెరిగిన
తత్త్వవేత్తలకు ప్రణామముంచి
సేవలుచేసి వినయమునిండి
ప్రశ్నించగ, వారుపదేశింతురు

దేనినితెలిసిన మోహముతొలగునొ
ఏబోధనతో సర్వభూతములు
నీయందున మరి నాలోకాంతువొ
అట్టిజ్ఞానమును తెలియుమునీవు.

పాపులందరిలొ అధికుడవైనా
పాపపు చేరును దాటుటకొరకు
జ్ఞాననావను ఆశ్రయించినచొ
తీరుగపాపము తొలగునుఅర్జున !

ఎగసినఅగ్ని సమిధలన్నిటిని
బూదిచేసినటు జ్ఞానాగ్నిమరి
సర్వకర్మలను భస్మముచేయును
తెలియుముతీరుగ కుంతికుమారా !

జ్ఞానాగ్నితొమరి సమానమయినది
ఇలలో ఏదియు లేదుధనంజయ !
అట్టిజ్ఞానము యోగసిద్ధితో
తనలోతానే పొందుటకగును

॥వేదసారమిది॥

శ్రద్ధ,నిష్ఠలు కలిగినవాడు
ఇంద్రియనిగ్రహ మున్న మనుజుడు
జ్ఞానమునందగ చాలినవాడై
శీఘ్రగతినితను శాంతినిపొందును

జ్ఞానములేక శ్రద్ధలేకను
సంశయాత్మునకు నాశముతప్పదు
సంశయప్రాణికి ఇహపరములలో
శాంతిసౌఖ్యములు ఉండవుఫల్గుణ !

యోగమునందు కర్మలువదలి
జ్ఞానముచే సందేహము విడచి
ఆత్మజ్ఞానివై నిలచినంతనే
కర్మలునిన్ను బంధించవయా !

కావున, పార్థా! కలతనుపెంచెడి
అజ్ఞానములో పెరిగె సందియము
జ్ఞానఖడ్గమున దానినినరికి
యోగనిష్ఠతో ధర్మమునెరపుము. ॥వేదసారమిది॥

## 5 వ అధ్యాయము

# కర్మ సన్యాసయోగము

మధుసూదన ! నీ బోధనవింటిని
కర్మసన్యాసము చేయుటనునది
కర్మయోగమును ఆచరించుటది
రెంటిలోఏది శ్రేయమొతెలుపుము ?

సవ్యసాచి! విను వివరించెదను
రెండూము క్తికి సుకరమైనవే
ఫలితములెన్నక కర్మలు చేసెడి
కర్మయోగమే శ్రేష్ఠమైనది

రాగద్వేషములు వదలినవాడే
సన్యాసిగను తెలియుము నీవు
కర్మబంధములు ద్వంద్వాతీతుని
ఎంతమాత్రము బంధించవయా !

జ్ఞానయోగము కర్మయోగము
వేరనినుడివెద రపండితులు ఇల
పండితులందురు ఏత్రోవయినా
రెంటి ఫలితములు అందించునని

జ్ఞానయోగులు పొందినస్థితినే
కర్మమార్గమున అందుటతథ్యము
రెండుమార్గముల గురి ఒకటేనని
తెలిసినవానికి నిజము తెలియును

కర్మయోగము సాధించకను
జ్ఞానయోగము పొందుటకష్టము
కర్మయోగము అభ్యసించిన
శీఘ్రమెబ్రహ్మము చేరునుఅతడు.

కర్మయోగియగు విజితేంద్రియుడు
శుద్ధమనస్కుడు విజితాత్ముడునై
సర్వభూతముల తనలోగాంచిన
కర్మబంధముల ముడిబడడెపుడు.

తత్త్వమునెరిగిన యోగయుక్తుడు
చూచునప్పుడు వినునప్పుడును
స్పృశించునప్పుడు ఆఘ్రాణించుచు
తినునప్పుడును తిరుగునప్పుడు

॥వేదసారమిది॥

నిదురించుచును శ్వాసించుచును
పలుకునప్పుడు విడచునప్పుడు
గ్రహించునప్పుడు రెప్పలార్చుచు
ఇంద్రియాలు పనిచేసెననుకొను

కర్మలనన్నీ బ్రహ్మార్పణమని
కోరికలేక చేయువానిని
నీటిలోనున్న తామరాకది
తడవనిచందము పాపములంటవు.

యోగమార్గమున విజితేంద్రియుడు
కర్మఫలముల వదలిశాంతుడగు
ఆశలొచిక్కి అజితేంద్రియుడు
కర్మబంధముల ముడిపడివుండును.

చిత్తశుద్ధికై యోగులు, మదిలో
ఫలాపేక్షను వదలినవారై
తనువు-మనసు-బుద్ధితోడను
ఇంద్రియాలతో కర్మనుచేతురు

ఇంద్రియనిగ్రహమున్న మనుజుడు
కర్మఫలములను పరిత్యజించి
నవద్వారములు ఉన్నపురమగు
తనశరీరమున సుఖముగనుండును

కర్తృత్వమున కర్మలయందు
ఫలితములందు ఆపరమాత్ముడు
జీవునికెంతయు బాధ్యతనుంచక
ప్రకృతిసిద్ధముగా జరిపించును

పరమాత్మ ఎవ్వరి పాపపుణ్యములు
స్వీకరించడు పాండునందనా!
అజ్ఞానముచే జ్ఞానము మరుగై
జీవులు భ్రమలో పడుచుందురయా!

ఆత్మజ్ఞానమున ఏమానవుని
అజ్ఞానమది నశించిపోవునొ
అట్టిజ్ఞానము ఆదిత్యునివలె
పరబ్రహ్మమును వెలుగజేయును

పరమాత్మలో బుద్ధియు నిష్ఠతో మనసు
లగ్నము చేసి పరమగతియని
తలచుజ్ఞానమున పాపము చెదరి
శాశ్వతమోక్షము నందుచుండిరి.

విద్యావినయములు కలిగినవిప్రుని
గోవు-శునకము- మత్తేభములను
శునకమాంసము తినుఛండాలుని
జ్ఞానిగాంచు సమదృష్టితోడుతను

సమభావనయు స్థిరమగుమనసు
కలిగినవారు జీవన్ముక్తులు
దోషములేనిది పరబ్రహ్మము
అట్టిబ్రహ్మమున వారున్నటులే.

నిశ్చలబుద్ధితొ మోహరహితుడు
బ్రహ్మమునందు నిలచినవాడై
సుఖదుఃఖముల ప్రియాప్రియముల
కలతచెందని బ్రహ్మజ్ఞానియగు.

॥వేదసారమిది॥

బాహ్యసుఖముల కోరికలేనివొ
ఆత్మసుఖము నత డందుచుండును
బ్రహ్మనిష్ఠయను యోగమునంది
శాశ్వతసుఖమును పొందుచుండును

విషయవాంఛల అమరుభోగములు
అస్థిరమయినవి దుఃఖహేతువులు
కావున విజ్ఞుడు వాటియందున
కోరిక పెంచక దూరమునుండును.

కుంతికుమారా! తనువుసుతీవుడు
వీడకముందే కామక్రోధముల
గెలిచినవాడు యోగిగమారును
స్థిరమగుసుఖమును అతడుపొందును.

ఎవ్వడుఆత్మలో సుఖపడనేర్చునో
ఆత్మయందునే ఆనందము నందునో
ఆత్మప్రకాశము నందినవాడై
అతడుబ్రహ్మమును చేరునుపార్థా!

కల్మషసంశయ రహితులుఅయిన
ఇంద్రియనిగ్రహమున్న ఋషులు మరి
సర్వప్రాణుల శ్రేయముకోరుచు
బ్రహ్మపదమును చేరుచుందురు

కామక్రోధముల మదమణగించి
చిత్తమునంతయు లొంగదీసుకొని
ఆత్మదర్శనము చేసినమునికి
పరమపదమది వెదకుచువచ్చును

॥వేదసారమిది॥

బాహ్యసుఖములను దరిరానీయక
భృకుటిమధ్యన దృష్టిని నిలిపి
నాసికాపుటల సంచరించుచు
ప్రాణవాయువు అపానవాయువు

మితముచేసి ఇంద్రియాలను
మనసును, బుద్ధిని నిగ్రహించుకొని
భయక్రోధములు వదలినవాడు
ఎల్లప్పుడును ముక్తుడేసుమా !

సర్వయజ్ఞములు అన్నితపస్సులు
నన్నుచేరునని నేనీశ్వరుడని
అన్నిప్రాణులకు హితుడనునేనని
తెలిసినమనుజుడు శాంతినిపొందును. ॥వేదసారమిది॥

## 6 వ అధ్యాయము

# ఆత్మసంయమ యోగము

ఫలాపేక్షను వదలి, కర్మను
చేసినయోగి సన్యాసియగు
చేయదగిన తన కర్మలన్నిటిని-
అగ్నిహోత్రము వదలుటకాదు

ఓ ధనంజయా ! సన్యాసము అని
దేనినందురో అదియోగమయా !
సంకల్పములను వదలనివాడు
యోగియెన్నడూ కానేరడయా !

యోగమార్గమును అధిరోహించగ
కర్మసాధనము కావలయునయా !
పూర్తిగదానిని అధిరోహించగ
కర్మనివృత్తి సాధనమగును

ఇంద్రియవిషయము లందునమరియు
కర్మలయందాసక్తి నుంచక
సంకల్పములను పూర్తిగ విడచునా
అతడుయోగమున కర్హుడుపార్థా !

తననేతను మరి ఉద్ధరించుకొని
అధోగతికి తను పోనేకూడదు
తానేతనకొక స్నేహితుడగును
లేనిచొతానే తనశత్రువగు

మనసుజయించిన మనిషికావలె
అట్టిమనసు మరి బంధువుఅగును
మనసుజయింప బడకపోయినచొ
శత్రువుఅయి అపకారముచేయును

జయింపబడిన మనసుకలిగినచొ
శీతోష్ణములు సుఖదుఃఖములు
మానావమానము లొకటిగతోచును
చెదరకనిలచును అతనిఅనుభవము

విజితేంద్రియుడు జ్ఞానమునంది
నిర్వికారుడై మట్టిని రాతిని
బంగారమును సమముగజూచుచు
యోగనిష్ఠుడు యోగయుక్తుడగు

॥వేదసారమిది॥

సుహృత్తు-మిత్రుడు-బంధువు-సాధువు
శత్రుల మరియు ఉదాసీనుల
సజ్జనులందు పాపులయందున
సమభావనతో నుండునుశ్రేష్ఠుడు

ఏకాంతమున ఒంటరిగాను
విజితేంద్రియుడై ఆశలులేక
మనసుజయించి దానముగొనక
మనసునుఆత్మలొ నిలుపునుయోగి

శుచిశుభ్రతగల సమప్రదేశమున
దర్భలుపరచి కృష్ణాజినమున
సన్నని వలువ చక్కగపరచి
స్థిరముగఆసన శుద్ధిగకూర్చొని

ఏకాగ్రతతో మనసునుగెంచి
ఇంద్రియాలను చిత్తమునణచి
ఆత్మశుద్ధికై యోగాభ్యాసము
తీరుగనిష్ఠగ చేయగవలెను.

శరీరమ్మును - మెడను - శిరసును
నిలువుగ - గీతగ నుంచి, చూపును
నాసిక కొనపై నిలపి కదలక
కూర్చొనిసలుపుట యోగాభ్యాసము.

ప్రశాంతచిత్తము నిర్భయత్వమున
బ్రహ్మచర్యవ్రత దీక్షనువదలక
మనోనిగ్రహము నాపైగురితో
నన్నేనమ్మి ధ్యానించవలె.

॥వేదపారమిది॥

మనోనిగ్రహము కలిగినయోగి
నిరతముమనసులొ ధ్యానమునిలపి
నాస్వరూపమగు మేలగునట్టి
మోక్షరూపమగు శాంతినిపొందును.

అమితభోక్తకు నిరాహారునికి
అతిగానిద్ర. నిద్రసలెరుగని
స్థితిలో అర్జున ! జ్ఞానయోగము
అసలుపొసగదు వినుమితీరుగ

ఆహారమున విహారమ్మున
మితముమించక కర్మలయందు
మితజోక్యము మరి మితమగునిద్రతొ
సలిపెడియోగము దుఃఖము[త్రెంచును

మనసునుబాగుగ నిగ్రహించుకొని
ఆత్మయందునే స్థిరముగనిలిపి
కోరికలన్నీ జయించుయోగి
యోగసిద్ధిని, పొందినవాడగు

స్వాధీనమున నున్నచిత్తమది
గాలికికదలక నిలిచివెలిగెడు
దీపముతో దృష్టాంతముగాను
చెప్పబడినది, నిశ్చలమయినది

ఆ విధి అభ్యాసములో సుఖమది
ఇంద్రియసుఖముల కందనిసుఖము
యోగమువలనను పొందుటకగును
ఆత్మానందము శాశ్వతసుఖమది.

॥వేదసారమంది॥

దానినిమించిన మేలగుసుఖము
దొరకదుపార్థా! అది దొరకివచో
ఎంతటిదుఃఖము కలిగినగాని
మనసుచలించక స్థిరముగనుండును.

ఇంతటిఫలితము నిచ్చెడియోగము
విశ్వాసముతో ఎంతోదీక్షతో
అభ్యాసమున సాధించవలె
ఆత్మదర్శనము చేయగవలెను.

సంకల్పమున కలుగుకోరికలు
పూర్తిగవిడచి మనసుచేతను
ఇంద్రియాలను వశముచేసుకొని
బుద్ధిచె మనసును గెలువగవలెను.

బుద్ధితోమనసును బాహ్యమునుంచి
మరలించి మరి అంతరంగమున
ప్రశాంతిపొంది మనసునంతట
ఆత్మయందునే నిలపగవలెను.

చపలత్వముచే నిలకడనేర్వని
మనసుచరించుట ఆరంభించిన
పథమునుమార్చి ఆత్మయందునే
స్థిరముగనుంచి వశమొనర్పవలె.

ప్రశాంతచిత్తుని, కామక్రోధములు
జయించినిలచి, బ్రహ్మరూపమును
పొందినయట్టి, దోషరహితుని-
ఉత్తమసుఖము చేరునుకాదా!

॥వేదసారమిది॥

ఆవిధముగను మనసుసర్వదా
ఆత్మయందునే నిలకడజేసిన
దోషరహితుడగు యోగి సులభముగ
బ్రహ్మరూపమగు సుఖమును పొందును.

యోగమార్గమున గెలచినయోగి
సమదృష్టితో అతడన్నియుగాంచును
సర్వప్రాణులను తనలోగాంచును
తననేగాంచును సర్వభూతముల

సర్వభూతముల నన్నేగాంచి
నాలోసర్వము గాంచినవానికి
నే, కనబడక ఉండుట జరగదు !
నాకాతడు కనబడక పోడయా !

ఏకత్వముతో సర్వభూతముల
నన్నుగాంచుచు సేవలుచేసెడి
యోగి ఏవిధిగ ప్రవర్తించినా
నాయందున అతడున్నటులగును.

అంతటఫల్గుణు డడిగెమాధవుని
సమత్వమ్ముతో సిద్ధింపదగు
యోగము, నీ ఉపదేశసారము
తెలియగనైతిని చంచలమనసుతో.

ఓశ్రీకృష్ణా! మనసుచంచలము
క్షోభపెట్టునది బలమైనది మరి
నిగ్రహించుటకు దుష్కరమయినది
గాలినిఅణచుట వంటిదిఅగును.

॥వేదసారమిది॥

అంతట శ్రీభగవానుడు పలికెను
ఫల్గుణ ! నిజమే నీవనుడివినది
అభ్యాసమున వైరాగ్యమున
మనసుఅదుపులో నుంచగవశమగు

మనసుఅదుపులో నుంచకపోయిన
యోగసిద్ధిని పొందుట జరగదు
ప్రయత్నపరుడై ఉపాయమ్ముతో
సాధనచేసిన సాధ్యమగునది.

తిరిగి పార్థుడు అడిగెకేశవుని
శ్రద్ధయున్నను మనోనిగ్రహము
లేనివాడు మరి యోగమునుండి
జారినఏగతి పొందునుకృష్ణా !

యదుకులభూషణ ! బ్రహ్మమార్గమున
స్థిరత్వమును మరి పొందకపోయిన
గాలికిచెదరిన మేఘముతీరున
ఇహపరములచెడి నశించిపోడా ?

ఓగోవిందా ! నా సందేహము
తీర్చగచాలుదు వీవేనయ్యా !
సమర్థులింకొక రెవరూలేరు
అన శ్రీకృష్ణుడు పలికె కిరీటితో.

యోగభ్రష్టుడు పుణ్యలోకములు
చేరివసించి, తిరిగి పుడమిని
సదాచారము సిరిగలయింటిలో
పుట్టుట జరుగును పాండునందనా !

॥వేదసారమిది॥

లేనిచో అంతకు మించినట్టిదగు
జ్ఞానమునిండిన యోగివంశమున
జన్మించును మరి అంతటిజన్మ
దుర్లభమయినది జగతినిపార్థా !

గతజన్మలోతన సాధనఫలము
కలిసినబుద్ధి సంస్కరింపబడి
పరిపూర్ణమగు యోగసిద్ధికై
తీవ్రప్రయత్నము నాతడుచేయును.

పూర్వజన్మలో తన అభ్యాసము
యోగమార్గమున లాగునుఅతనిని
యోగమార్గమును తెలియగోరుటచె
వేదకర్మలను మించినఫలమగు

పట్టుదలయుమరి సాధననిండిన
యోగి, పాపముల కందనివాడయి
పలుజన్మల అభ్యాసఫలమున
ఉత్తమగతియగు మోక్షమునందును.

తపసుకన్నను యోగము శ్రేష్ఠము
జ్ఞానముకన్నను మిన్న అయినది
వేదకర్మలను మించిన శ్రేష్ఠము
కావున ! అర్జున యోగివి కమ్ము.

అట్టియోగులలో ఎవ్వడునన్ను
శ్రద్ధగ మనసున నిలపి, ధ్యానమున
భజించుచుండునొ అట్టివాడు మరి
సర్వశ్రేష్ఠుడని నేభావించెద.

॥వేదసారమిది॥

## 7 వ అధ్యాయము

# విజ్ఞాన యోగము

నారాయణుడు పలికెనరునితో
నాపైగురితో ఆశ్రయించుకొని
యోగమునెరపుచు నిస్సంశయముగ
నన్నుతెలుసుకొను విధముతెలిపెదను

జ్ఞానముఅనగా ఎట్టిదొచెప్పెద
విజ్ఞానము వివరించెదవిప్పుడు
రెంటినితెలిసిన సర్వముతెలియును
ఇలలోమిగలదు తెలియగదగినది

వేయిమందిలో ఒక్కరుమాత్రము
మోక్షసిద్ధికై యత్నించెదరు
వారలయందు ఒక్కరుమాత్రము
పూర్తిగనన్ను తెలుసుకొందురు

నింగీనేలలు, అగ్నియు-వాయువు
జలము-మనసు, బుద్ధియు-అహము
అనునెనిమిదియు నాఅంశములే
అపరాప్రకృతి నటువిభజించితి

మరియొకప్రకృతి పరాప్రకృతి
జీవరూపమది చేతనాత్మకము
జగతినంతయును ధరించునదియే
విశదపరచితిని విజయానీకు

అపరాప్రకృతి అనునెనిమిదితో
జీవరూపమగు పరాప్రకృతితొ
సర్వభూతములు జనియించునయా !
సృష్టిలయములకు మూలమునేను

॥వేదసారమిది॥

నన్ను మించినది ఏదియులేదు
మణిహారమున మణులన్నిటికి
ఆధారమగు దారముపగిది
నాఆశ్రయమున నిలచును అన్నీ

వేదములో ఓంకారప్రణవమును
సూర్యచంద్రులలో కాంతిని నేను
నింగిలోశబ్దము జలములరుచియు
మనుషునిపౌరుష మంతయు నేనే

మట్టిలోశోభిలు గంధమునేనే
అగ్నిలోనున్న తేజమునేనే
సర్వభూతముల ప్రాణమునేనే
తాపసులందరి తపశ్శక్తిని

సర్వభూతముల మూలబీజమును
పార్థా! తెలియుము తీరుగనన్ను
బుద్ధిమంతుల బుద్ధిని నేను
తేజోవంతుల తేజమునేను

భరతశ్రేష్ఠ విను, బలవంతులలో
రాగము ఆశయులేనిబలమును
ధర్మవిహితమగు ప్రాణులయొక్క
కోరికనేనే తెలియుమునన్ను

సాత్విక-రాజస తామసగుణములు
నావలకలిగెను తెలియుమునీవు
కానీ! వాటిలో నేనులేనయా
నా అధీనమున కలవవిపార్థా!

॥వేదసారమిది॥

అట్టి త్రిగుణముల వికారమ్ము చే
మోహమునందిన జగతిసర్వము
త్రిగుణాలకునే నతీతుడనని
అవ్యయుడనుఅని తెలియకున్నది

కారణమేమన దైవసంబంధపు
త్రిగుణాత్మకమగు నాదగుమాయ
దాటగశక్యముకానిది అయినది
ననుశరణన్న దాటుటసుకరము

పాపులు-మూఢులు మాయకులొంగి
జ్ఞానమునందక అసుర ప్రవృత్తిని
ఆశ్రయించు అవివేకులందరు
నన్నుపొందుట జరుగుటలేదు

ఆపదతొలగగ, నన్నుతెలియగ
అర్థముకోరుచు, జ్ఞానముకలిగిన
నాలుగువిధముల పుణ్యతత్పరులు
ననుభజియించుచు నుండిరిపార్థా !

వారిలోనిత్యము పరమాత్మతొకలసెడి
పరమాత్మయందునే భక్తినిలపిన
జ్ఞాని శ్రేష్ఠుడు, అట్టిజ్ఞానికి-
నేనుఇష్టుడను, నాకతడిష్టుడు

పైనలుగురును మంచివారు మరి
జ్ఞానిఅనగ, నిక, నేనేఅందును
ఏలన, అతడు గురిగలమనసుతొ
నన్నునమ్మి నన్నాశ్రయించెను

॥వేదసారమిది॥

ఎన్నో జన్మల నెత్తినపిదప
జ్ఞానమునంది వాసుదేవుడే
సర్వముఅనుకొని నన్నుపొందును
అట్టిమహాత్ములు అరుదుకిరీటీ !

తమస్వభావముకు లోబడికొందరు
అవివేకముతో కోర్కెలునిండి
వివిధ నియమములు అవలంబించి
వివిధదేవతల భజియించెదరు

ఏఏభక్తుడు ఏఏమూర్తిని
మదిలోనిలపి శ్రద్ధనింపుకొని
పూజలుచేయునొ వారికివలయు
శ్రద్ధనుస్థిరముగ ఇత్తునునేనే

అల్పబుద్ధుల ఫలములునిలవవు
దేవపూజలతొ చేరుటవారిని
నన్నునమ్మి నను కొలుచుభక్తులు
పొందుటనన్నే పాండునందనా !!

నాశరహితము సర్వోత్కృష్టము
ప్రకృతిపరమగు నాస్వరూపము
నిజముతెలియక తెలివిహీనులు
మనిషిగనెంతురు మానవుడందురు

యోగమాయ అది కమ్మివున్నది
కనబడనయ్యా సర్వజనులకు
అక్షరుడనుఅని పుట్టుకలేదని
తెలియరునన్ను అవివేకులయి.

॥వేదసారమిది॥

త్రికాలవేదిని భూతజాలముల
పూర్వాపరములు పూర్తిగ తెలియును
కానీ అర్జున! ఏమి చిత్రమో
వీరెవ్వరును నన్నెరుగరయా !

పుట్టినవెంటనె సర్వప్రాణులు
రాగద్వేషముల పరిధిలోనున్న
సుఖ, దుఃఖముల వ్యామోహముతో
అజ్ఞానమున మునిగిపోదురు

పుణ్యకర్మలచె పాపములన్నీ
నశించిపోయిన ద్వంద్వాతీతులు
అజ్ఞానముతొలగి దృఢవ్రతులై మరి
సేవించుటది నన్నే అర్జున !

జరామరణముల విముక్తినందగ
ప్రయత్నపరులై ఆశ్రయింతురో
వారు, సమస్తము నిండినరూపము-
సర్వకర్మలు బ్రహ్మముఅందురు

అధిభూతము మరి అధిదైవమ్ము
అధియజ్ఞముల నిండిననన్ను
పూర్తిగతెలిసి మనసు నిలపిన
మరణసమయమునకూడా మరువరు.

॥వేదసార మిది॥

# 8 వ అధ్యాయము

# అక్షర పరబ్రహ్మ యోగము

అర్జునుడడిగెను అంబుజోదరుని
బ్రహ్మము అధ్యాత్మములననేమి
కర్మననేమి అధిభూతమెట్టిది
అధిదైవమ్మని దేనినిఅందురు ?

దేహమందు అధియజ్ఞుడెవ్వడు
అతనినితెలియుట ఏవిధి కేశవ !
ప్రాణముపయనము చేయుసమయమున
ఏవిధినిన్ను తెలియుటకగును ?

కుంతీనందన ! సర్వోత్తమమై
నాశములేనిది బ్రహ్మముఅనబడు
జీవునియొక్క వాస్తవమెరిగి
స్వభావమెరుగుట అధ్యాత్మమయా

ప్రాణికోట్లకు వలయుపదార్థము
ఉద్భవించుటకు వలయుక్రియలివి.
త్యాగమునిండిన యజ్ఞక్రియలను
చేయునట్టిది 'కర్మ' నబడును.

దేహధారులలో శ్రేష్ఠుడ ! అర్జున !
క్షరమగునట్టిది అధిభూతమయా
విరాట్పురుషుడు అధిదైవతమై-
దేహమందు అధియజ్ఞుడనేను

మరణసమయమున ననుస్మరియించుచు
తనువునువదిలెడి మానవులందరు
ననుచేరుదురు నాలోనుందురు
అందుకుసందియ మేమియులేదు

॥వేదసార మిది॥

దేహమువదలెడి, సమయమునందున
మనుజులందరకు కలిగెడితలపులు
భావనలన్నియు వారిజన్మలను
నిర్ణయించును—పుట్టెదరటులే.

కావున అర్జున! అన్నిసమయముల
ననుస్మరియించి యుద్ధముచేయుము
మనసును-బుద్ధిని నాకర్పించుము
తప్పకనన్ను చేరుకొందువు.

అభ్యాసముయోగము నిండినయట్టి
అన్యభావనల చెదరనిమనసుతొ
దివ్యతేజుడగు పరమపురుషుని
స్మరియించిన మరి చేరుటఅతనినె.

మరణసమయమున మనసునభక్తితొ
యోగబలమున ప్రాణవాయువును
భ్రుకుటిమధ్యన తీరుగనిలపి
సర్వజ్ఞుడగు పురాణపురుషుని.

జగన్నియంతను అణువుకంటెను
అతిసూక్ష్మమగు సంరక్షకుని
ఊహకుఅందని రూపముగలిగిన
రవితోసమమగు కాంతిమంతుని.

అజ్ఞానమునకు ఆవలనున్న
పరమాత్మను, నిశ్చలమైనమనసుతో
నిరతముధ్యానము చేయునాతడు
పొందుటమరి ఆ సర్వోత్తమునే.

॥వేదసారమిది॥

వేదవేత్తలకు నాశరహితముగ
రాగరహితులు విజితేంద్రియులకు
ఉనికిఅయినది సర్వజనులును
దేనినికోరుచు సాధనచేయుచు

బ్రహ్మచర్యమును అనుష్ఠించుచు
ఉందురో, అట్టి వివరముఅదియే
పరమాత్మవివరము-పరమపదమది
సంగ్రహమ్ముగా వివరించెద,విను !

ఇంద్రియమ్ముల తలుపులుమూసి
మనసునుఆత్మలో సూటిగనిలపి
యోగనిష్ఠతో ప్రాణవాయువును
సహస్రారమున నిలపగవలె

ప్రణవమంత్రమగు ఓంకారమది
ఒకేఅక్షరము ఉచ్చరించుచు
అనిశమునన్నే స్మరణచేయుచు
దేహమువదలిన మోక్షమునందును

కుంతీనందన ! అనన్యచిత్తుడు
నిరతమునన్నే స్మరించువాడగు
ధ్యానశీలికి నేను సులభముగ
అందెదనయ్యా ! సందియమేల?

సిద్ధిపొందిన మహానుభావులు
నన్ను చేరిమరి జన్మనెత్తరు
అస్థిరమైన దుఃఖభాజమగు
తనువునుదాల్చుట మరిజరగదయా !

॥వేదసారమిది॥

సవ్యసాచివిను ! అన్నిపదవులు
బ్రహ్మలోకము పర్యంతముగా
పుణ్యముతరిగిన పుట్టుకతప్పదు
ననుచేరినచో జన్మములేదు

బ్రహ్మపగలుమరి వేయియుగములని
అర్ధరాతిరి వేయియుగములని
తెలిసినవారు రాత్రింబవళుల
తత్వముబాగుగ తెలిసినవారు

బ్రహ్మపగలులో ప్రకృతియందు
చరాచరములగు సర్వముపుట్టును
తిరిగిరాత్రిలో అవ్యక్తములో
పుట్టినవన్నీ లీనమగునవే

ప్రాణులన్నియు బ్రహ్మపగలులో
కర్మకులోంగి జన్మలెత్తుచు
రాత్రియందుమరి లయమగుచుండి
తిరిగి పగలులో పుట్టుచున్నవి

పరమాత్మఅనునది అవ్యక్తమునకు
అతీతమై, మరి ఉత్తమమయినది
ఇంద్రియాలకు వ్యక్తముకానిది
పురాతనమది అక్షరమయినది

ఆ పరమాత్మ నాశరహితునిగ
అగోచరునిగ సర్వోత్తమునిగ
చెప్పబడును మరి పుట్టుకలేమికి
చేర్చెడునిలయము నాదై ఉన్నది

॥వేదసారమిది॥

అర్జున! ఎవనిలొ అన్నిభూతములు
వశించియుండి ఏ పరమాత్మ
విశ్వమంతయు విస్తరించెనో
ఆతడుదొరకును అనన్యభక్తికి

కుంతికుమారా! యోగులందరు
ఏ సమయములో మరణించినచో
ముక్తినంది మరి జన్మనందరో
వివరించెద విను విశదముగాను

ఉత్తరాయణము ఆరుమాసములు
అగ్నితేజము శుక్లపక్షము
పగటివెలుగు అది అట్టి సమయమున
తనువునువీడిన చేరును బ్రహ్మము

దక్షిణాయనము ఆరుమాసములు
చీకటి-పొగయు కృష్ణపక్షమున
తనువునువదలిన చంద్రలోకపు
వెలుగునుపొంది పుట్టునుతిరిగి

రెండుమార్గములు ఇలలోవున్నవి
వెలుగుమార్గము చీకటిత్రోవ
మొదటిదానిలో జన్మరాహితి
రెండవదానిలొ జన్మనెత్తుట

రెండుమార్గములు తెలిసినయోగి
భ్రమనుచెందడు ఎంతమాత్రము
కావున అర్జున! యోగివికమ్ము
సర్వకాలముల సర్వావస్థల

॥వేదసారమిది॥

వెలుగు-చీకటి వివరముతెలిసిన
యోగులు, మోహము నందరు వినుము
కావున నీవు సర్వకాలముల
యోగయుక్తుడవు కావలెవిజయా !

యజ్ఞయాగములు తపసువల్లను
దానమువలన కలుగుపుణ్యముల
మించినపుణ్యము నందుటెగాక
పరమపదము నతడధిష్ఠించును ॥వేదసారమిది॥

## 9 వ అధ్యాయము

# రాజవిద్యా-రాజగుహ్య యోగము

వనజోదరుడు నుడివెనుతీయగ
అర్జున ! నీవు దేనినితెలిసిన
అశుభరూపమగు బంధమునుండి
విడివడియుందువొ అట్టిదానిని

విజ్ఞానసహితము అతిరహస్యమగు
బ్రహ్మజ్ఞానమును లెస్సగనీకు
అసూయలేని వాడవుగనుక
చెప్పెదనిపుడు తీరుగవినుము.

విద్యలయందు శ్రేష్ఠమైనది
రహస్యాలలో రహస్యమయినది
సర్వోత్కృష్టము పవిత్రమయినది
బ్రహ్మజ్ఞానము పాండునందనా !

ధర్మయుక్తము నాశరహితము
అనుష్ఠించగ అతిసులభమయా
ప్రత్యక్షముగ తెలియదగినది
వివరించెదవిను విశదముగాను.

ఆత్మజ్ఞానమను ధర్మమునందు
శ్రద్ధనెరుగని మనుజులందరూ
నన్నుపొందక మృత్యురూపమగు
సంసారవలయమున చిక్కియుందురు.

అవ్యక్తరూపమై జగతినంతయు
నిండియుంటిని సర్వవ్యాప్తిగా
అన్నిభూతములు నాయందున్నవి
నేనుమాత్రము వాటిలోలేను.

భూతజాలములు నాలోనుండవు
ఈశ్వరీయమగు యోగమహిమగను
అన్నియునాచే సృజించబడినా
వాటియందునే నుండకపోవుట.

గొప్పదిఅయిమరి స్వేచ్ఛగతిరుగుచు
ఆకసమందు నిలచుగాలివలె
సర్వప్రాణులు నాలోనుండును
తెలియుముతీరుగ పాండునందనా !

కుంతికుమారా ! కల్పాంతములో
సర్వభూతములు నాలో లయమగు
మారుకల్పములో నేనేమరల
సృజియించెదను తెలియుమునీవు

స్వభావసిద్ధము అగుప్రకృతికి
లొంగినయట్టి అస్వతంత్రమగు
జీవులన్నిటిని నాదగుమాయచె
తిరిగి తిరిగినే సృజించుచుందును.

॥వేదసారమిది॥

ఇన్ని కర్మలను ఒనరించినను
కర్మలేవియు బంధించవునను
కర్మలయందా సక్తినిచూపను
తటస్థముగ నే నుందునుతెలియుము

ఓ ధనంజయా ! నియామకుడనగు
నాచేప్రకృతి, చరాచరములను
సృజించుచున్నది దానివలననే
ప్రవర్తించును సర్వజగత్తు

నాపరతత్వము తెలియని మూఢులు
సర్వభూతముల నియామకుడను
మనుజదేహము ధరించినంతనె
నన్ను తెలియక లక్ష్యమునిలపరు

వ్యర్థమోహము వ్యర్థకర్మలు
వ్యర్థజ్ఞానము కలిగినవారు
బుద్ధినశించి అసురభావనల
అసురస్వభావము నాశ్రయింతురు

మహాత్ములందరు దైవస్వభావము
ఆశ్రయించి నను, ఆదికారణుని
నాశరహితునిగ తెలియగనేర్చి
ఏకాగ్రతతో సేవింతురయా !

దైవస్వభావము కలిగినవారు
అనిశమునన్ను కీర్తించుచును
భక్తితొకొలిచి అనిశమునాపై
చిత్తమునిలపి ఉపాసింతురు

॥వేదసారమిది॥

కొందరుజ్ఞాన యజ్ఞముతోను
ఒకేరూపమని ఉపాసింతురు
ద్వైతమనుచును అనేకమనుచు
ఉపాసింతురు మరికొందరిల

క్రతువుననేనే యజ్ఞమునేనే
పితృదేవతల భుక్తమునేనే
ఓషధి-మంత్రము హవిస్సునేనే
హోమకర్మయు అగ్నియునేనే

జగతికితల్లియు తండ్రియునేనే
రక్షకుడను మరి తాతనునేనే
తెలియదగినది పావనమయినది
ఓంకారము మరి వేదత్రయమును

గతియు,భర్తను ప్రభువును, సాక్షిని
జీవులనిలయము, హితముగూర్చెడి
సృష్టిస్థితిలయ కర్తయునేనై
అవ్యయమయిన మూలబీజమును.

ఎండలు, వానలు ఇచ్చుటనేనే
వాటినిఅదుపులో నుంచుదునేనే
మృత్యువునేను అమరత్వమును
ఉన్నదినేనే లేనిదినేనే.

వేదములెరిగి యజ్ఞముచేసి
సోమరసముతో కర్మదోషముల
క్షాళనచేసుకు నాకముచేరి
స్వర్గభోగములు అనుభవింతురు.

॥వేదసారమిది॥

ఆర్జితపుణ్యము క్షీణించగనే
మనుజలోకమున జన్మించెదరు
వేదకర్మలతొా భోగాభిలాషులు
రాకపోకలు కలిగియుందురు.

అన్యచింతనలు ఎంతయులేక
అనిశమునన్నే ఉపాసించుచు
అనవరతము నను ధ్యానముచేసెడి
యోగులక్షేమము చూతునునేను.

సకలయజ్ఞముల భోక్తనునేను
ప్రభువునునేను అయినను నన్ను
నిజముతెలియక పోవుటచేతను
ఉన్నతినందక జన్మనందెదరు.

ఇతరదైవముల కొలిచెడివారలు
నిజముగనన్నే పూజించుటది
కుంతికుమారా ! వారిపూజలు
త్రోవమారినా చేరుటనన్నే.

దేవతలను భజియించువారలు
ఆదేవతలను చేరుచుందురు
పితృదేవతల పూజలుచేసి
వారినిచేరుచు నుందురుకొందరు.

భూతమ్ములను పూజించుచును
వాటినిచేరుట జరుగుచుండును
ననుపూజించిన నన్నుచేరుదురు
పూజలబట్టి పుణ్యములుండును.

ఫలమో,పుష్పమొ ఓచిగురాకో
చివరకుదోసెడు జలముఅయినను
భక్తితోయిచ్చిన నాకందునది
నిజమగుపూజకు భక్తి ప్రాణము.

కుంతీనందన ! ఎల్లప్పుడునూ
హోమముచేయుచు దానముచేయుచు
తపసుచేయుచు భజించుచుండి
సర్వమునాకు అర్పణచేయుము.

ఈవిధముగను కర్మసమర్పణ
యోగము, సలిపిన పుణ్యాపాపముల
బంధనమందక విముక్తికలిగి
నన్నుపొందుట జరిగితీరును.

సర్వప్రాణులలో సమముగనుందును
ఇష్టుడు ద్వేషి, అని నాకెవరు?
భక్తితోకొలిచెడి వారిలోఉందును
వారుఉందురు తప్పకనాలో.

దురాచారుడగు మనుజుడుఅయినా
నిశ్చలభక్తితో ననుభజియించిన
సత్పురుషునిగా తలచుట ఏలన?
స్థిరమగు నిశ్చయమున్నమనుజుడని.

అతడునన్నుమరి ఆశ్రయించుకొని
అతితొందరలో ధర్మాత్ముడగు
శాశ్వతశాంతిని అందునుపార్థా !
ఇది నా ప్రతిన భక్తుడుచెడడని.

॥వేదసారమిది॥

పాపజన్మము కలిగినమనుజులు
స్త్రీలు, చాతుర్వర్ణములందు
నన్నునమ్మిమరి ఆశ్రయించిన
ఉత్తమపదవిని పొందుట తథ్యము

పుణ్యముచేసిన వారలవిషయము
వేరుగనుడువగనేల ధనంజయ !
అనిత్యమయిన సుఖరహితమగు
నేలనుంటివి పూజింపుమునను.

నాపైమనసుతో భక్తుడవగుము
ననుపూజించి నమస్కరింపుము
చిత్తమునాపై నిలపి, గతియని
నమ్మిన చివరకు పొందుటనన్నే. ॥వేదసారమిది॥

## 10వ అధ్యాయము

# విభూతి యోగము

అర్జున ! నీకు నా మాటలతో
సంతసమొదవగ, హితమునుకూర్చగ
తలంపుతో మరి తీరుగనేను
చెప్పెడిమేలగు పలుకులు వినుము.

నేప్రభవించుట సురలకు తెలియదు
మహాఋషులకు తెలియదు ఏలన ?
వారందరికి ఆదిపురుషుడను
వారిరాకకు నే కారణము

ఏమనుజుడునను పుట్టుకలేని
అనాదిరూపుని లోకేశ్వరుడని
తెలియునొవాడు మనుజులందరిలో
జ్ఞానిగనెరుగుము పాపముతొలగును

బుద్ధియు-జ్ఞానము నిర్మోహమ్మను
క్షమా-సత్యము శమదమాదులు
శాంతి-సుఖము జనన-మరణములు
భయనిర్భయములు సుఖదుఃఖములు

అహింసయున్ను సమతా-తృప్తియు
తపసుయు-దానము యశస్సనంతయు
అందరికిచ్చెడి వాడనునేనే
నానిజరూపము తెలియుమునీవు

సప్తఋషులు, సనకాదిమునీంద్రులు
మనువులునాదగు మానసపుత్రులు
పుట్టిరితొలుత వారలసృష్టియె
లోకమునందలి ఈజనులందరు

నావిశాల విభూతియోగము
యదార్థమ్ముగా తెలిసినవారు
నిశ్చలమయిన యోగమునుందురు
అందుకుసందియ మేమియులేదు.

సర్వముపుట్టును నానుంచే విను
అదితెలిసిన యీ జ్ఞానులందరు
బుద్ధీ నిలకడ కలిగినవారై
అనంతభక్తితొ భజియించెదరు

॥వేదసారమిది॥

మనసుపూర్తిగా నాలోనిలిపి
ప్రాణము నా ఆధీనమునుంచి
నిత్యమునాదగు చింతనచేయుచు
ఆనందమును పొందుచుండిరి

నిరతమునాపై మనసునునిలపి
ప్రీతిగనన్ను భజించువారికి
నన్నుపొందగ వీలగునట్టి
జ్ఞానయోగమును ప్రసాదింతును

వారినిదయతో చూతునునేను
వారిఆత్మలో నిలచి తేజముతొ
జ్ఞానదీపము వెలిగించెదను
అజ్ఞానతిమిరము తొలగించెదను.

పరబ్రహ్మము పరంధాముడవు
పరమపావనా! ప్రకాశమూర్తివి
ఆదిదేవునిగ నాశరహితునిగ
పరమపురుషుని జన్మరహితునిగ.

సర్వవ్యాప్తివిఅనుచు ఋషులును
దేవఋషియగు నారదమహాఋషి
అసిత, దేవలులు వేదవ్యాసుడు
నుడివిరిస్వయముగ నుడివితి వటులే

కేశవ! నీవు నుడివినదంతా-
సత్యమైనదని నమ్మితిదేవా!
నీస్వరూపము దేవాసురులును
తెలియగజాలక పోదురుకాదా !

॥వేదసారమిది॥

పురుషోత్తమ ! నువు సృష్టికిమూలము
సకలజీవులకు నియామకుడవు
దేవతలకునువు దేవుడవయ్యా !
జగన్నాథ ! నిను తెలియదు పీవే

యోగీశ్వర!నిను అనిశమునేను
ఎటుధ్యానించుచు తెలిసికొనుటయా!
ఓభగవంతా! ఎందెందున నిను
తెలుసుకుమరి నే ధ్యానముచేయుట ?

నీ యోగమహిమలు విభూతులన్నియు
సవిస్తరముగ వివరించుమయా-
నీబోధనలు అమృతధారలు
ఎంతగ్రోలినను తనివితీరదు

పరంధాముడు పాండునందనుని
ప్రేమగచూచి పలికెమధురముగ
నావిభూతులకు అంతములేదు
శ్రేష్ఠమైనవి తెలిపెదవినుము

సర్వజీవుల హృదయములోగల
ఆత్మనునేనే ప్రాణులయొక్క
ఆదిమధ్యములు అంతమునేనే
తీరుగతెలియుము కుంతీనందన

ఆదిత్యులలో విష్ణువునేను
దేవతలందు దేవేంద్రుడను
ఇంద్రియాలలో మనసునునేను
ప్రాణులందలి చైతన్యమును.

॥వేదసారమిది॥

రుద్రులందున శంకరుడను నే
యక్ష-రాక్షసుల ధనపతినేను
వసువులందున పావకుడను నే
పర్వతాలలో మేరువునయ్యా !

పురోహితులలో శ్రేష్ఠుడనేను
బృహస్పతిగ నను తెలియుమునీవు
సేనాపతులలొ స్కందుడనేను
సరస్సులందున సాగరుడను నే

మహాఋషులలో భృగుమహాఋషిని
వాక్కులందున ఓంకారమును
యజ్ఞములందు జపయజ్ఞమును
స్థావరంబుల హిమవంతంబును

వృక్షములందు అశ్వత్థమును
దేవఋషులలో నారదుడను నే
గంధర్వులలో చిత్రరథుడను
సిద్ధులందున కపిలమహాఋషిని

తురగములందు ఉచ్చైశ్రవమును
అమృతమథనము నందుపుట్టినది
గజములందు నే ఐరావతమును
నరులందున నే రాజునగుదును

ఆయుధాలలో వజ్రాయుధమును
గోవులందున కామధేనువును
ప్రజావృద్ధికగు మన్మధుడను నే
సర్పములందు వాసుకినేను

॥వేదసారమిది॥

నాగులందున అనంతుడగుదును
జలములయేలిక వరుణుడగుదును
పితృదేవతల ఆర్యముడను నే
నియామకులలో యముడనునేనే

దైత్యులందున ప్రహ్లాదుడను
గణకులందున కాలపురుషుడను
మృగములందున సింహమునేనే
పక్షులందున వైనతేయుడను

వడిగలవాటిలో వాయువునేను
శస్త్రముపట్టిన శ్రీరాముడను
జలచరంబుల మొసలినినేను
నదులయందున పవిత్రగంగను

సృష్టికిమొదలు నేనేఅర్జున
మధ్యము-అంతము అన్నినేనే
విద్యలందు ఆధ్యాత్మికవిద్యను
వాదనలందలి వాదనశక్తిని

అక్షరాలలో అకారమగుదును
సమాసాలలో ద్వంద్వము నేను
నాశములేని కాలమునేనే
సర్వవ్యాప్తిని విరాడ్రూపిని

సర్వహరణమగు మృత్యుదేవతను
జీవోత్పత్తికి మూలమునేను
స్త్రీలలో శ్రీయు, యశము-ఓర్పు
ధృతి-మేధస్సు-జ్ఞప్తి-వాక్కులను

॥వేదసారమిది॥

సామవేదమున బృహత్సామమును
ఛందస్సులలో గాయత్రిని నే
మాసములందు మార్గశిరమును
ఋతువులందు నే వసంతఋతువును

వంచనలందు జూదమునేను
తేజోవంతుల తేజమునేను
జయమును, యత్నము నేనేపార్థా!
సత్వవంతుల సత్వగుణంబును

వృష్ణికులమున వాసుదేవుడను
పాండవులందున ధనంజయుడను
మునులయందున వ్యాసమహఋషిని
కవులయందున శుక్రాచార్యుడ

దండించుటలో దండనీతిని
జయాభిలాషుల రాజనీతిని
రహస్యములలో మౌనమునేను
జ్ఞానవంతుల జ్ఞానమునేను

భూతజాలముల కెల్లమూలమును
సర్వజీవులలో నేనులేనిది
ఏదియులేదు పాండునందనా !
సర్వమునేనని తెలియుమునీవు.

అర్జున ! వింటివ దివ్యములయిన
నావిభూతులకు అంతములేదు
అట్టివాటిలో కొన్నిమాత్రమే
సంక్షేపముగా చెప్పితినేను

॥వేదసారమిది॥

శ్రీనిండినది కాంతికలిగినది
ఉత్సాహముతో నిండినట్టివగు
అన్నియునాదగు అంశములేయని
నాతేజము అవి తెలియుమునీవు

విభూతులన్నీ తెలిసియుఅర్జున
ప్రయోజనము నీకేమికలుగును
అనంతవిశ్వము నాస్వరూపమున
అంశమాత్రమని తెలియుమునీవు.

## 11వ అధ్యాయము

# విశ్వరూప సందర్శన యోగము

అర్జునుడంతట పలికెవినయముగ
కేశవ ! నీ ఉపదేశరహస్యము
అనుగ్రహించిన ఆత్మతత్వపు
బోధనతో నా మోహముతొలగెను

కమలనేత్ర ! నీ పలికినపలుకులు
ప్రాణులఉనికి జనన-మరణములు
వివరముగా నే వినగలిగితిని
నిన్నుతెలియుటది నీచలవేకద !

పురుషోత్తమ ! నీ అపురూపమగు
రూపముచూడగ మనసుకలిగినది
యోగీశ్వర ! నా కన్నులుదానిని
చూడగలుగునా ? చూపుముదేవా !

పార్థునికోరిక విని పరమాత్ముడు
పలికెను "నాదగు విశ్వరూపము"
వివిధరీతుల వివిధ వర్ణముల
వందలు-వేలుగ-నుండుటగనుము

॥వేదసారమిది॥

వసువులు-ఆదిత్యులు-అశ్వనులు
మరుత్తులు మరి రుద్రులుగలిగి
ఇంతకుముందు ఎరుగనిఎన్నో
దివ్యరూపములు నాలోగాంచుము.

చరాచరములు సకలజగత్తు
సర్వమునాలో నుండుటగాంచుము
నీకన్నులకా రూపముఅందదు
దివ్యచక్షువుల నిచ్చెదగనుము.

శ్రీహరిపలికి పార్థునితోను
''విశ్వరూపమును'' దర్శించునటు
అనుగ్రహించగ చూచె కిరీటి-
అని, సంజయుడు తెలిపెను రాజుకు

ఎన్నోముఖములు ఎన్నోకన్నులు
అద్భుతమైన దివ్యరూపము
దివ్యాభరణము లున్నవియెన్నో
దివ్యాస్త్రములు-వలువలు-మాలలు.

దివ్యసుగంధము వెలయించునది
దిశలన్నిటిలో కాంతులుజల్లుచు
లెక్కకుచిక్కని ముఖములుగలిగి
వేయిసూర్యు లుదయించినట్టుగా.

తేజోవంతము ఆనందముతో
వెలగసాగినది దివ్యరూపము
సర్వజగత్తు చరాచరములవి
దేవదేవునిలో చూచె కిరీటి.

॥వేదసారమిది॥

అమితాశ్చర్యము గగురుపాటుతో
పార్థుడుపలికెను నారాయణునితొ
కరములుముడిచి నమ్రతనిండి
భక్తిపండిన గొంతుతొనుడివెను.

నీదేహములో లోకముచూచితి
సకలప్రాణులు కమలాసనుడు
అందరుఋషులు నాగదేవతలు
నీలోలీనము కాగాచూచితి.

విశ్వరూప ! ఓ విశ్వేశ్వరుడా !
ఎన్నోచేతులు ఉదరములెన్నో
లెక్కకుచిక్కని వక్త్రములుండి
ఎటుగాంచినను నిండినరూపము.

ఆదిమధ్యముల కందనిరూపము
అగపడుచున్నది ఆదిదైవమా !
అల్లదె- ధగధగ లాడు కిరీటము
గదయు-చక్రాయుధములుగలిగి.

అన్నిదిక్కులకు వెలుగులుచిమ్ముచు
సూర్యతేజమై చూపులకందక
ఇంతనిచెప్పగ అంతుపట్టక
కొలతకుఅందని దివ్యరూపము.

నాశములేని పరబ్రహ్మము
శాశ్వతధర్మము నిండినవాడవు
లోకముకంతయు ఆశ్రయమిచ్చెడి
ఆదిదేవునిగ తెలిసితినిన్ను.

॥వేదసారమిది॥

ఆదిమధ్యములు అంతములేని
అమితశక్తితో నిండినయట్టి
లెక్కలకందని చేతులుగలిగి
సూర్య-చంద్రులే నేత్రద్వయముగ

కనబడుదేవా ! నీముఖబింబము
జ్వలించుచున్న అగ్నిగుండము
నీతేజము యీ సర్వజగతిని
తపింపచేయుట చూచితికేశవ !

ఓ పరమాత్మా ! నింగినేలను
నిండిననీవు లేనిది ఎందున ?
ఒక్కడివై నీ వన్నిటగలవు
ముల్లోకములు వణకుచున్నవి.

సర్వదేవతలు నీలోచేరుచు
భయముతొవణకుచు చేతులుమోడ్చి
స్తుతించుచుండిరి సిద్ధులు-ఋషులు
స్వస్తిస్తోత్రములు పఠించుచుండిరి.

రుద్రులు-వసువులు ఆదిత్యులును
సాధ్యులు-మరుత్తులందరు మరియు
విశ్వదేవతలు అశ్వనిసురలు
ఊష్మవులందరు పితృదేవతలు

సుర-గంధర్వ యక్ష-అసురులు
చూచుచుండిరి ఆశ్చర్యముతో
బహుముఖమ్ములు బహుపాదములు
ఎన్నోఉదరములున్న నిన్నుగని

॥వేదసారమిది॥

అనేకదంష్ట్రా కరాళమ్ములు
కలిగిన నీ యీ రూపముగాంచి
వణకుచున్నవి లోకములన్నీ
నిలువలేక నే వణకుచుంటిని

విశ్వమునిండిన విష్ణుమూర్తివి
ఆకసమంటెడి దివ్యరూపము
మెరసెడిరంగులు జ్వాలనేత్రములు
వక్త్రములన్నీ గాంచి-అలసితిని

భయముగొలుపు నీదంష్ట్రములన్నీ
కాలాగ్నియగు ముఖబింబములు
చూచిననేను స్థిమితము దప్పితి
దయగొనినన్ను అనుగ్రహించుము.

భూమీనాథులు కౌరవులందరు
భీష్ముడు-ద్రోణుడు-సూతకుమారుడు
వీరలెందరో అతివేగముతో
వజ్రదంష్ట్రముల వక్త్రమునందు

అతివేగముతో జొరబడిపోవుట
శిరసులుపగిలి నశించిపోవుట
ప్రక్కలు-ముక్కలు అయిపోవుటయు
కోరలమధ్యలో చిక్కుటగాంచితి.

పరుగులు-ఉరకల నదీజలములు
సాగరగర్భములోన దూకినటు
ఎందరోవీరులు వడివడిగా, నీ
వక్త్రమునందు దొర్లుటచూచితి

అగ్నినిబడిన మిడతలమాదిరి
నీనోళ్లలొ వారందరుబడిరి
లోకములన్ని మ్రింగుచుంటివి
నాలుగువైపుల మండెడినోళ్ళతొ

అతిభీకరమగు నీనిజరూపము
ఎరుకపరచుము- ఇదె వందనము
ఆదిపురుష! నన్ననుగ్రహించుము
నిన్నుతెలియునటు తెలియచెప్పుము.

అంతట శ్రీభగవానుడు పలికెను
పార్థా! కాలుడ నేననితెలియుము
లయమగులోకము నంతయు, నేను
అంతమందగా చేతును, తెలియుము

కాలపురుషుడను లోకములన్నియు
భక్షింపగ, నే విజృంభించితి
యుద్ధముచేయగ నీవుమానినను
శత్రుసైన్యము బ్రతుకదునిజము

ఆహవభూమిలొ నున్నయోధులు
అసువులుబాయుదు రనితెలియుమయా !
అందరుముందే నాచేమడసిరి
నిమిత్తమాత్రుడ వీవనితెలియుము

ద్రోణుడు-భీష్ముడు-జయద్రధుడును
కర్ణుడు-మరియు వీరులందరను
చంపుమునీవు భయపడవలదు
ఆజినిలువుము రిపులగెలిచెదవు

॥వేదసారమిది॥

ఆవిధముగ, భగవానుడు అనగా
భయముతొ వణకుచుకిరీటిఅంతట
విష్ణుమూర్తితో పలికినపలుకులు
వినిచెసంజయుడు ధృతరాష్ట్రునకు

హృషీకేశ ! నీ సంకీర్తనలో
లోకములన్నీ సంతసమందును
అసురులు పరుగులు తీయుచుండిరి
అంజలినిడిరి సిద్ధులందరును

అనంతరూపా ! ఓపరమాత్మా !
జగన్నివాసా ! అక్షరరూపా !
బ్రహ్మకుకూడా ఆదికారణా !
అంజలిఘటించ కెటులుండెదరు?

ఆదిదేవుడవు సర్వమునెరిగిన !
పురాణపురుషా ! జగదాధారా !
తెలిసినవాడవు తెలియగదగుదువు
విశ్వమునిండిన అనంతమూర్తీ !

వాయువునీవే కాలుడవగుదువు
వరుణుడు-అగ్ని చంద్రుడునీవే
ప్రజాపతివి నువు ప్రపితామహుడవు
తిరిగితిరిగి ఇవె వేలనమస్సులు

అన్నివైపులా నిండిననీకు
అంజలియిదిగో సర్వస్వరూపా
అమితవిక్రమము అతిసామర్థ్యము
కలిగిననీవు సర్వవ్యాప్తివి.

॥వేదసారమిది॥

ఇంతటి మహిమోపేతుడవగు నిను
అప్యాయతతో అజ్ఞానముతో
మిత్రుడనుచును కృష్ణా అనుచు
యాదవాయని పిలచితినయ్యా !

మన్ననలేని నాపిలుపులను
విహరించుచును ఏకాంతమున
భోజనాదుల నిద్రాదులలో
మన్నించని నను నువుక్షమియించుము

అచ్యుతనీవు అసమానుడవు-
చరాచరమగు జగతికిపితవు
పూజార్హమగు గురుదేవుడవు
ముల్లోకముల మించరెవరు నిను-

సాష్టాంగముగా ప్రణామమిడితిని
ఈశ్వరుడవు నువు నియామకుడవు
జగతిస్తుతింప నర్హుడవీవు
అనుగ్రహింపగ వేడుచుంటిని

తనయునియెడల తండ్రిప్రేమతో
మిత్రునియెడల మిత్రభావనతో
ప్రియసతియందు ప్రియునిప్రీతివలె
నాఅపరాధము క్షమించతగుదువు

ఇంతకుముందు ఎవ్వరుచూడని
దివ్యరూపమును చూచితిదేవా !
ఆనందించితి భయముతీరగా
సుందరమూర్తిగ దర్శనమిమ్ము

॥ వేదసారమిది ॥

వెనుకటిమాదిరి వెలుగుకిరీటము
చక్రధారివై గదనుధరించి
నిలబడుమయ్యా సహస్రబాహో !
దర్శించెద నీసుందరరూపము

అనవిని, అచ్యుతు డనెనుపార్థునితో
అంతములేనిది అనాదిఅయినది
పరిపూర్ణమగు విశ్వరూపము
మున్నుఎవ్వరు చూడనిరూపము

అనుగ్రహించితి యోగశక్తితో
మానవులెవ్వరు చూడనిరూపము
వేదాధ్యయనులు తపోధనులును
యజ్ఞయాగములు సలిపినవారలు

చూడలేరు యీ విశ్వరూపమును
నీవుభయమును వదలుముఅర్జున
మనసుదిటవును కోల్పోవకుము
తిరిగిచూడు నా ప్రసన్నరూపము

అనుచుపలికి శ్రీభగవానుడు అట
కుంతీసుతుని అనుగ్రహించి
సుందరరూపము సంతరించెనని
సంజయుడనెను ధృతరాష్ట్రునితో

ఓజనార్ధనా? నీ యీరూపము
గాంచిననేను ఊరటపొందితి
మనసువశమునకువచ్చెనుదేవా !
వెనుకటిస్థితికి వచ్చితికృష్ణా !

॥వేదసారమిది॥

అనినపార్థునితో గోవిందుడు అనె
నీవుచూచిన దివ్యరూపమును
దేవతలందరు చూడగోరెదరు
అందరువారికి దుర్లభమైనది

వేదాధ్యయనులు తాపసోత్తములు
యజ్ఞయాగములు చేసినవొందరు
నిశ్చలభక్తితో మాత్రముసాధ్యము
తెలియుట-చూచుట-నన్నుచేరుటది

పాండునందనా! కర్మాచరణము
నాకై చేయుచు నన్నేపొందగ
ఫలితమువదలి సమతనుపెంచి
ననుభజియించిన నన్నుచేరెదరు. ॥వేదసారమిది॥

## 12వ అధ్యాయము

# భక్తియోగము

సగుణరూపమును ఆరాధించెడి
నిర్గుణరూపము ఉపాసించెడి
వారిలో ఉత్తమ యోగులెవ్వరు ?
అడిగెనుపార్థుడు అంబుజోదరుని

నాయందుననే మనసునునిలపి
అమితశ్రద్ధతో సగుణరూపమును
ఆరాధించెడి భక్తులందరును
ఉత్తమయోగులు పాండునందనా !

ఇంద్రియాలపై నిగ్రహముంచి
అన్ని విషయముల సమభావనతో
సర్వభూతముల హితమునుకోరుచు
నాశరహితుని భావాతీతుని

సర్వవ్యాపకుని స్థిరమగువానిని
అగోచరుడు మరి నిర్వికారుడగు
నిర్గుణరూపుని ఉపాసించగను
నేర్చినయోగులు నను చేరెదరు

నిర్గుణరూపము అగుపరమాత్మను
మనసంతయును లగ్నముచేయగ
తనువుదాల్చిన సాధకులకును
ఎంతోకష్టము ప్రయాసమెందు

సర్వకర్మలు నాకర్పించి
ఆసక్తినెంతయు పెంచుకొనకను,
ఏకాగ్రతగల మనసునుకలిగి
నను ధ్యానించెడి భక్తులందరిని

నిగ్రహమ్ముతో నిలచినవారిని
కర్మసన్యాసము చేసినవారిని
అతిశీఘ్రముగా మృత్యుఛాయగల
సంసారజలధిని దాటించెదను

స్థిరముగనాపై మనసునునిలపి
బుద్ధిని నాలో లీనముచేయుము
అటులచేయగ చాలినచో, నువు
నాలోనుండుట జరిగితీరును

॥వేదసారమిది॥

అర్జున ! వినుము నాయందుననే
స్థిరముగచిత్తము నిలపజాలనిచొ
అభ్యాసయోగమును అవలంబించి
నన్నుపొందగ యత్నముచేయుము

ఆటులచేయుట సాధ్యముకానిచొ
నాకుప్రియమగు కర్మలుచేయుచు
నాసేవలలో లగ్నముఅయినచొ
ననుచేరెదవు సిద్ధికలుగును

ఆవిధముగను చేయగలేనిచొ
నిగ్రహమ్ముతో మనసువశముతో
నిత్యము నీవు చేసెడికర్మల
ఫలితములన్నీ త్యజించివేయుము

అభ్యాసముకన్నను జ్ఞానమున్న
జ్ఞానముకన్నను ధ్యానమున్న
ధ్యానముకన్నను కర్మఫలముల
త్యాగముమిన్న శాంతినీయునది.

సర్వజీవులన ద్వేషములేక
అహములేక మరి స్నేహము-కరుణతొ
సుఖదుఃఖముల సమభావనతో
ఓర్పు-తృప్తి-యోగమునేర్చి

మనసువశములో నుంచగలిగి
దృఢనిశ్చయము కలిగినవాడు
నాపైమనసు బుద్ధినినిలిపిన
మానవుడెంతయో ఇష్టుడునాకు

॥వేదసారమిది॥

లోకమునెంతయు భయపెట్టకను
లోకము కెంతయు వెరువనియట్టి
మోదము-క్రోధము భయవ్యాకులముల
లొంగనివాడు నాప్రియభక్తుడు

అపేక్షవిడచి, పరిశుద్ధుడుఅయి
కార్యదక్షుడు తటస్థుడై మరి
కార్యారంభము నందేత్యాగము
భక్తినిండిన వాడుఇష్టుడు

సంతోషముతో పొంగిపోకను
ద్వేషము-శోకము కోరుకొనకను
శుభాశుభములను వదలినవాడగు
భక్తుడు నాకుఇష్టుడు పార్థా !

శత్రువు-మిత్రుడు స్తుతినిందలును
శీతోష్ణములు సుఖదుఃఖములు
మానావమానము లన్నిటియందు
సమభావనతో మోహములేక

మౌనమునిండి భక్తితోనుండి
తృప్తినిపొందుచు కోరికలేక
నిశ్చలబుద్ధి కలిగినభక్తుడు
నాకుఇష్టుడు పాండునందనా !

నేనుచెప్పిన అమృతమయగు
ధర్మముతెలిసి శ్రద్ధతో -నేనే
గతియనితలచి కొలచుభక్తులు
నాకుమిక్కిలి ప్రియతములగుదురు.

॥వేదసారమిది॥

## 13వ అధ్యాయము

# క్షేత్ర-క్షేత్రజ్ఞ విభాగయోగము

పరమాత్మనడిగెను పాండునందనుడు
ప్రకృతి-పురుషుల జ్ఞానజ్ఞేయముల
క్షేత్ర-క్షేత్రజ్ఞులు అనగనెవ్వరో
వివరముగామరి వివరింపుమనె

పాండునందనా ! జ్ఞానులందరు
ఈశరీరమును క్షేత్రమందురు
క్షేత్రమునెవ్వరు తెలిసికొందురో
వారలనందురు క్షేత్రజ్ఞులని

క్షేత్రములనెడి శరీరములలో
వసించువాడను నేనే అర్జున
క్షేత్ర-క్షేత్రజ్ఞుల వివరముతెలిసిన
కలిగెడుజ్ఞానము నిజమగుజ్ఞానము

క్షేత్రముయొక్క పూర్వాపరములు
ఆకారములును వికారములును
ఆక్షేత్రజ్ఞుని రూప-భావములు
సంక్షిప్తముగా తెలిపెదవినుము

బహురీతులలో వేదములందు
వివరించిరి యీ వివరములన్ని
బ్రహ్మసూత్రముల హేతుబద్ధముగ
నిశ్చయించి యీ విషయములుంచిరి

పంచభూతములు అహము-బుద్ధియు
మూలప్రకృతి కర్మేంద్రియములు
పదియగువాటితొ మనసునుచేర్చి
వాటికి అయిదు జ్ఞానేంద్రియములు

॥వేదసారమిది॥

ఇచ్ఛా-ద్వేషము సుఖ-దుఃఖములు
దేహేంద్రియములు తెలివి-ధైర్యము
అన్నీ కలిపిన క్షేత్రము దీనిని
సంగ్రహమ్ముగా వివరించితిని

ఆత్మస్తుతియు దంబములేక
అహింస మరియు ఓర్పును నేర్చి
ఋజువర్తనము గురువుల సేవ
బాహ్యాభ్యంతర శుద్ధికలిగియు

సన్మార్గముతో స్థిరవర్తనము
మనోనిగ్రహము వైరాగ్యములతొ
అహములేక మది జరామరణములు
పుట్టుకబాధలు స్మరణలోనుంచుకు

దారాపుత్రులు నాయిల్లనుచు
ఆసక్తిలేకను మోహమునందక
శుభాశుభములు సమముగనెంచి
భగవానునిపై నిశ్చలభక్తియు

ఏకాంతమును ఆనందించుచు
జనసమూహముల ప్రీతిలేకను
ఆధ్యాత్మజ్ఞానము కలిగియుండుట
తత్వజ్ఞానపు ఉన్నతితెలియుట

జ్ఞానమందురు పాండునందనా !
దానికిభిన్నము అయినవన్నియు
అజ్ఞానముగా తెలియగదగును
విశదముగా నే వివరించితిని

॥వేదసారమిది॥

తెలియగదగిన బ్రహ్మస్వరూపము
అమృతమయమగు మోక్షమునిడునది
అనాదియగు, పరబ్రహ్మము జ్ఞేయము
సత్తు-అసత్తుల కందనట్టిది

సర్వవ్యాపకము కరచరణముల
కన్ను-నోరు-కర్ణము-ముఖముతో
అన్నిటనుండి అంతానిలచి
వ్యాప్తిచెందినది బ్రహ్మమువినుము

ఇంద్రియమ్ములు లేనటువంటిది
ఇంద్రియశక్తులు కలిగినట్టిది
దేనినితాకక అన్నిటనిలచును
నిర్గుణమైనను గుణములనేలును

బహిర్గతముగా ఉన్నటులున్నా
అంతర్గతమై అలరారునది
స్థిరమైనది అది అయినావినుము
చలనముకంతయు అదిమూలమయా

సూక్ష్మరూపమై అజ్ఞానముకందక
దూరమునున్నటు కనబడువస్తువు
కానీ, తెలిసిన ఎంతోదగ్గర
చేరగచాలిన మరీదగ్గర

అవిభక్తము అది అనేకరీతుల
విభజించినటు కనబడునట్టిది
సర్వభూతముల సృష్టి-స్థితియు
లయముచేయుచు నుండెడిదగుచు

॥వేదసారమిది॥

ప్రకాశించెడి ప్రకాశమదియే
చీకటిగెలిచిన జ్యోతియునదియే
అదే జ్ఞానమున తెలియదగినది
ప్రతి హృదయములో ప్రభవించునది

క్షేత్రము మరియు జ్ఞానము-జ్ఞేయము
సంక్షేపముగా వినిచితివిజయా !
చక్కగతెలిసిన భక్తుడు నాలో
లీనముకాగల అర్హుడుఅగును

ప్రకృతి-పురుషుడు అనబడు రెంటికి
ఆది అన్నది, లేదనితెలియుము
మనోవికారము మొదలగు గుణములు
ప్రకృతిజన్యము లైనవిపార్థా !

కార్యకారణ కర్తృత్వములు
ప్రేరణకలుగుట ప్రకృతివలన
వెలువడునట్టి సుఖ-దుఃఖములు
పురుషుడుపొందుట జరుగుచుండును

ప్రకృతిఫలితము గుణములన్నియు
పురుషుడుఅనబడు ఆత్మకుచెందును
దీనివల్లను కలుగునుపుడమిని
ఉత్తమ-అధమ జన్మలునరులకు

భరించువాడని సాక్షియనుచును
అనుభవించునని సమ్మతినిడునని
పరమేశ్వరునిగ పరమాత్మగను
పురుషునిఅందురు దేహమునున్నను
॥వేదసారమిది॥

ఈ విధముగను పురుషునిగూర్చి
గుణములగూర్చి-ప్రకృతిఅనగ
సత్యముతెలిసిన జ్ఞానికి పార్థా
పునర్జన్మమరి కలుగదువినుము

ధ్యాననిష్ఠులై కొందరుయిలలో
చిత్తశుద్ధితో ఆత్మనుచూతురు
సాంఖ్యయోగము కర్మయోగమున
కొందరుఆత్మను చూచుచుండిరి

ఈవిధముగను ఆత్మదర్శనము
చేయగలేని వారుకొందరు
ఉపదేశమున ఉపాసనమున
ఫలితమందెదరు శ్రవణతత్పరులు

కుంతీనందన ! నిలచియున్నవి
కదలునట్టివి సర్వముపుట్టుట
క్షేత్రముతోమరి క్షేత్రజ్ఞుడును
కలియుటవలన సంభవమగును

అన్నిప్రాణులలో సమముగనున్న
పరమాత్మనుగనుచు అయాప్రాణులు
నశించినాఅవి నశించననునది
తెలిసినవాడు నిజముతెలిసినటు

అట్టివాడు పరమాత్మఅన్నిట
వ్యాపించినటు తెలియగనేర్చి
తనఆత్మను హింసకు గురిచేయకను
ఉన్నతగతిని పొందుచుండును

॥వేదసారమిది॥

కర్మల ప్రేరణ ప్రకృతి అనియు
ఆత్మ ఎన్నడూ కర్త కాదని
తెలిసినవాడు నిజము నెరిగినటు
తెలియుము పార్థా ! వివరముగాను

సర్వభూతములు ఒకటై నిలచుట
ఒకేదానిలో వెలువడుటయును
తెలిసినవాడు బ్రహ్మపథమును
తెలిసినవాడై చేరుటదానిని

ఆత్మ జనించదు అనాది అయినది
గుణాలులేవు శరీరమ్ములో
ఉన్నను-కర్మలు అది చేయదయా
మార్పులేక పరిశుద్ధమయినది

అంతట నిండిన ఆకాశమది
అంటుపడదు కదదేనివల్లను
అటులనె ఆత్మ తనువులో నున్నను
అంటనీయదు మలినములెవ్వీ

సూర్యుడొక్కడే సర్వలోకమున
ఎటుల ప్రకాశము నింపుచుండునో
అటులే క్షేత్రజ్ఞుడు పరమాత్మ
అన్ని క్షేత్రముల వెలుగులు నింపును

క్షేత్ర-క్షేత్రజ్ఞుల భేదమును
భూత-ప్రకృతి విముక్తిమార్గము
జ్ఞానచక్షువుల చూచినవారు
పరమపథమును చేరుదురయ్యా

॥వేదసారథి॥

## 14 వ అధ్యాయము

# గుణత్రయ విభాగ యోగము

అంబుజోదరుడు నుడివెనుతీయగ
ఏజ్ఞానమున సిద్ధికలుగునో
జ్ఞానములన్నిట మిన్నయేదియో
అట్టిజ్ఞానమును వివరించెదవిను

ఈ జ్ఞానతత్వమును ఆశ్రయించుకొని
నాలోఐక్యము పొందినవారై
జనన-మరణముల బాధలులేక
సృష్టి-ప్రళయముల తాకిడికందరు

భరతకుమారా! ప్రకృతిఅన్నది
లోకసృష్టికి నిలయముఅదియే
అందుబీజమును నే-నాటగను
సర్వభూతములు ఉద్భవించును

ఎట్టిగర్భమున జన్మమునందిన
ప్రకృతిమాతగ-తనువులుపుట్టును
బీజమునాటెడి తండ్రిగనన్ను
తెలియుమునీవు కుంతికుమారా !

సత్వరజస్సు తమోగుణములు
ప్రకృతిజన్యము అయిననుపార్థా !
నాశరహితుడగు ఆత్మనుఅవియే
తనువునందు బంధించుచున్నవి

అందుసత్వము నిర్మలమయినది
ప్రకాశించునది అపాయమెరుగదు
సుఖాసక్తితో జ్ఞానాపేక్షతొ
జీవునిఅదిబంధించుచున్నది

॥వేదసారమిది॥

ఓకౌంతేయా! రజోగుణమది
రాగమునేర్పి కోరికపెంచును
వాటితోఆది కర్మలయందు
ఆసక్తినిపెంచి ఆత్మనుకట్టును

తమోగుణము అజ్ఞానఫలితము
మోహవిభ్రమము కలుగజేయును
మరపు-బద్ధకము-సోమరితనముతో
జీవునిలెస్సగ బంధించునది

సత్వగుణమది సుఖములయందు
రజోగుణమది కర్మలయందును
తామసగుణము జ్ఞానముంత్రుచి
మరపునుపెంచును ఆశ్చర్యమయా!

పాండునందనా! సత్వముఒకచో
రజో-తమముల గెలచినిలచును
మరియొకచోట రజోగుణమది
రెంటినిగెలచి నిలచుచుండును

అదేవిధముగా తమోగుణమది
సత్వ-రజస్సుల గెలుచుచుండును
అవిధముగను మానవులందరు
త్రిగుణాలకుచు బద్ధులగుదురు

సర్వేంద్రియముల జ్ఞానప్రకాశము
వెలుగులునింపుచు నిలచివెలిగిన
సత్వగుణముఅది గెలచినిలచెనని
తెలియుటతేలిక కుంతికుమారా!

భరతకుమారా ! లోభత్వముతో
కర్మలుచేయుట ఆరంభించి
మనశ్శాంతిమరి లేకపోవుట
రజోగుణము అభివృద్ధినొందు చే

కుంతీనందన ! అవివేకముతో
సోమరితనము అజాగ్రత్త తో
అజ్ఞానము - మౌఢ్యము నిండినప్పుడు
తమోగుణమది గెలచినదగును

సత్వగుణమది నిండినప్పుడు
తనువును వీడిన జీవుడెప్పుడు
ఉత్తమజ్ఞానులు అందదగిన
ఉత్తమలోకము లందుచుండును

రజోగుణముతో తనువునువీడిన
కర్మాసక్తి కలిగినజన్మము
తమోగుణముతో తనువువదలిన
మూఢునిగా జన్మించును పార్థా !

సత్కర్మలతో ఫలితములందుట-
నిర్మలసుఖము సాత్వికఫలము
రజోఫలితము దుఃఖమందురు
తమోఫలిత మజ్ఞానతిమిరము

సత్వమువలన జ్ఞానముకలుగును
రజోగుణమున లోభముపెరుగును
తమోగుణమున మరపు-భ్రమయు
అజ్ఞానములు కలుగుచున్నవి.

॥వేదసారమిది॥

సత్వగుణమున నిలచినవారు
ఊర్ధ్వస్థితికి చేరుచుందురు
రజోగుణమున మధ్యస్థితియు
తమోగుణముతో అధమస్థితియగు.

కర్తగగుణముల నెంచువివేకి
గుణములకాతడు దూరమనుచును
తీరుగతెలిసి జ్ఞానమునందిన
వారుచేరుటది నన్నే తెలియుము.

దేహముకలిగిన జీవుడుపార్థా!
త్రిగుణమ్ములను దాటగచాలిన
జననమరణము వార్థక్యములచె
విడువబ చును మోక్షమునందును.

అంతటపార్థుడు అడిగెమాధవుని
త్రిగుణాలనుమరి గెలచినట్టుగ
తెలియుటఎట్లు? దాటుటఎట్లు?
అతనినడవడి ఎటులఉండును?

బదులుపలికెను భగవానుడుఅట
జ్ఞానిఎన్నడును సత్వప్రకాశము
రజోకర్మలు తామసమైకము
ఆశించకమరి ద్వేషించకను

త్రిగుణప్రేరకము లగు,కార్యముల
కలతచెందక అగుణములవి
వాటికార్యములు నెరవేరెనని
ఉదాసీనత కలిగియుండును.

॥వేదసారమిది॥

సుఖదుఃఖములు సమముగనెంచుచు
స్తుతినిందలను ఒకటిగతలచుచు
కనకము-మట్టి పాషాణముల
సమముగనెంచుచు ధైర్యముకలిగి

అవమానమ్ము సన్మానమును
స్తుతి-నిందలను ఒకటిగనెంచి
మిత్రుడు-శత్రువు సమమేఅనుకొని
కర్మారంభము నందేత్యాగము

కామ్యకర్మలను త్యజించనేర్చి
బ్రహ్మనిష్ఠలో సతతమునిండి
ఏమానవుడు మెలగుచుండునో
అతడుగుణములకు అందడు విజయా !

నిశ్చలభక్తితో నాసేవలతో
త్రిగుణాలకుఅత డతీతుడగుచు
బ్రహ్మతత్వమును చేరగచాలిన
సమర్థతనుమరి కలిగియుండును.

నాశరహితమగు ! అవ్యయమైన
శాశ్వతధర్మము నా స్వరూపము
అమృతమయమగు బ్రహ్మమునకును
చేర్చి, సుఖములను ఇచ్చెదపార్థా !

॥వేదసారమిది॥

## 15వ అధ్యాయము

# పురుషోత్తమ ప్రాప్తియోగము

వేదవిదులుసం సారమునంతయు
నాశములేని అశ్వత్థవృక్షమని
ఊర్ధ్వముఖముగా వ్రేళ్లనుకలిగి
అధోముఖమున శాఖలున్నవని

పత్రములన్నీ వేదవచనములు
త్రిగుణమ్ములను శాఖలుకలిగి
బలముగ క్రిందికి పైకి ఎదుగుచు
ఇంద్రియవిషయములనుచిగురులతో

వ్రేళ్లదిగువకు దిగుచు, కర్మను
ప్రేరేపించును దానిస్వరూపము
ఈలోకములో తెలియగచాలరు
ఆదిమధ్యములు-అంతముఅందవు

ధృడచిత్తముతో అనాసక్తియను
కరవాలముతో ఛేదించుటది
బ్రహ్మముచేరగ ప్రయత్నమగును
ఆదిపురుషుని అదిచేర్చునయా !

అహము-మోహము తొలగునుఅపుడు
ఆత్మజ్ఞానమున కోరికగెలచును
సుఖ-దుఃఖముల ద్వంద్వముకందక
నాశములేని స్థితికిచేరెదరు.

సూర్య-చంద్రులు హుతవాహనుని
మించినకాంతితొ వెలుగుస్థానమది
పరంధామమది అచటికిచేరిన
తిరిగిరారు, అది నాస్థానమయా !

॥వేదసారమిది॥

పరబ్రహ్మమగు నా అంశమది
జీవునిగా యిల నిలచియున్నది
ప్రకృతి-మనసులు ఆకర్షించుకు
తనువున జీవునిగావెలుగునది

గాలిసువాసన మోసితెచ్చునటు
జీవునిలోన గుణములుఇమిడి
మరియొకతనువును చేరునప్పుడు
పంచేంద్రియములు మనసుతొ చేరును

పంచేంద్రియముల లోబరచుకొని
తినుట-వినుట-చూచుట-స్పర్శ
ఆఘ్రాణించుచు మనసునేలుచు
ఇంద్రియభోగము లనుభవించును

ప్రాణవాయువులు వీడునప్పుడు
తనువునందుఅవి నిలచునప్పుడు
గుణభోగములతొ మూఢులెరుగరు
జ్ఞానచక్షువుల కదితెలియునయా !

కర్మయోగులు తనువుననున్న
ఆత్మదర్శనము చేయసమర్థులు
పరిణతపొందని అజ్ఞానులకు
అందదు-వారు ఎంతచేసినా

జగతికివెలుగును ఇచ్చెడిసూర్యుని
చంద్రునివెలుగు, అగ్ని తేజము
అన్నినాదగు తేజములగును
తెలియుమునీవు వివరముగాను.

॥వేదసారమిదే॥

పుడమిలోనుండి నాదగుశక్తిచె
ప్రాణికోట్లను ధరించుచుంటిని
రసమూర్తియగు చంద్రుడనేనై
సస్యసంపదతో పోషణచేతును

వైశ్వానరుడను జఠరాగ్నిగ-నే
ప్రాణులదేహము లాశ్రయించుకొని
జీవశక్తితో నాలుగువిధముల
ఆహారమును పచనముచేతును

సకలప్రాణుల హృదయమునుందును
జ్ఞాపకశక్తి-మరపు-జ్ఞానము
కలిగించెదను వేదవేద్యుడను
వేదకర్తను-వేదార్థమును

లోకమునందు యిరువురు పురుషులు
క్షరులక్షరులని ఉన్నవారిలో
దేహములన్నియు క్షరరూపములు
కూటస్థుడగు జీవు డక్షరము

వీరుగాక ముల్లోకములందు
నిండి-భరించు నాశరహితుడు
ఈశ్వరుడయిన పురుషోత్తముడు
పరమాత్మగను బరగుచుండును

క్షరరూపునినే నతిక్రమించి
అక్షరరూపుని మించినశ్రేష్ఠుడ
కావున లోకము వేదములందు
పురుషోత్తమునిగ ప్రసిద్ధిగాంచితి

॥వేదసారమిది॥

అజ్ఞానమ్ము విడచి ఎవడు నను
పురుషోత్తమునిగ తెలియగలుగునో
వాడుసర్వము తెలిసినవాడై
నిండుమనసుతో ననుభజియించును.

పాపరహితుడా ! ఓధనంజయా !
అతిరహస్యమగు శాస్త్రముతెలిపితి
తీరుగతెలిసిన జ్ఞానవంతుడై
కృతార్థుడాతడు అగుటజరుగును.

## 16 వ అధ్యాయము

# దైవాసుర సంపద్విభాగయోగము

నిర్భయత్వము సత్వసమృద్ధియు
జ్ఞానయోగము నిలకడకలిగి
దానము-ఇంద్రియ నిగ్రహమ్మను
యజ్ఞము-తపసు-శాస్త్రపఠనము

అహింసనిండి సత్యావర్తనము
క్రోధములేని త్యాగశీలత
శాంతినిండి-మరి కపటములేక
భూతదయయును అలోలత్వము

చపలతలేక బిడియములేక
సాధుస్వభావము కలిగియుండుట
పరాక్రమమ్ము-క్షమా-ధైర్యములు
శుచితో-ద్రోహము లేకపోవుటయు

ఆత్మస్తుతిఅది లేకుండుటయు
మొదలగువన్నీ భరతనందనా !
దైవసంపదగ నెంచగవలెను
సుగుణమ్ములుగా వెలుగొందునవి

॥వేదసారమిది॥

దంబము-గర్వము-అభిమానమ్ము
కోపము-కఠినత-అవివేకమ్ము
అసురసంపదగ తెలియుమునీవు
అమరునుఅవి ఆ అంశలొపుట్టిన

దైవసంపదకు బంధవిముక్తి
అసురసంపదకు బంధనశక్తి
కలుగును-నీవు దైవసంపదను
కలిగినవాడవు చింతనువదలుము

లోకమునందు దైవసంబంధపు
అసురసంబంధపు జన్మలురెండు
దైవసంబంధపు గుణములుతెలిపితి
అసురజన్మల గుణములుతెలిపెద

అసురప్రవృత్తి కలిగినజనులు
ధర్మాధర్మ ప్రవృత్తులనెరుగరు
ఆచారమును శుచిత్వమెరుగరు
సత్యముఅన్నది తెలియమవారికి

ఇలలోసత్యము లేదనిఅందురు
జీవాధారము ధర్మముఅనరు
ఈశ్వరుడెవడు ? ప్రాణులయొక్క
కామహేతుకము సృష్టిఅందురు

ఈవాదముతో అల్పబుద్ధులయి
క్రూరకార్యములు చేయుచుండి మరి
జగతికిశత్రువు లయిపోయెదరు
వినాశనముకై ఉద్భవింతురు

॥వేదసారమిది॥

తీరనికోర్కెల తగిలియుందురు
దంభము-మదము అభిమానములతో
అవివేకముతో చెడు నేవినుచు
అపవిత్రమగు పనులొనర్తురు

జీవితాంతము చింతలోమునిగి
విషయవాంఛలే గొప్పగతలచి
ఆశాపాశములందున బిగిసి
తెగనిబంధముల ముడిపడిపోయి.

కామక్రోధముల పూర్తిగలొంగి
తుచ్ఛసుఖముల మనసుపెంచుకు
న్యాయమువిడచి ధనముగడించగ
యత్నములెన్నో చేయుచుందురు

ఇదిలభించినది కోరికతీరెను
ఇకపైమరియొక కోరికున్నది
కావున నేను అదిపొందగను
వలయుయత్నము చేయగవలెను.

ఆశత్రువును గెలిచితినేను
మిగిలినరిపులను హతమొనరించెద
ఏలికనేను - సుఖములునావి
బలవంతుడను కొరతనెరుగను.

శ్రీమంతుడను ఉన్నతవంశము
నాకుచాలిన వారుమరెవ్వరు ?
యజ్ఞముచేసెద దానములిచ్చెద
ఆనందమునే ననుభవింతునని.

॥వేదసారమిది॥

చిత్తవిభ్రమము లెన్నో పెంచుకు
మోహపాశముల ముడిపడిపోయి
కామభోగములు వదలగలేక
విషయాసక్తితో నరకమేగెదరు.

ఆత్మస్తుతితో వినయములేక
ధన-మానములతో మదించిపోయి
అహంకారము-బలము-గర్వము
కామము-క్రోధము పూర్తిగనిండి

తమతనువులలో పరులతనువులలో
ఉన్న నన్ను మతి ద్వేషించుచును
అసూయనిండి అశాస్త్రీయముగ
నామమాత్రపు యజ్ఞముచేతురు

నను ద్వేషించెడి అసురప్రవృత్తికి
క్రూరకృత్యములు పాపకార్యములు
చేయుజనులకు జనన-మరణముల
నీచజన్మములే నిరంతమ్మును.

అసురసంబంధపు జన్మలనెత్తి
అవివేకముతో నన్ను పొందక
అధమాధమమగు అసురప్రవృత్తితో
జన్మించెదరు కుంతీనందన!

నరకమునకుగల మూడుద్వారములు
కామ-క్రోధ-లోభమ్ములు తెలియుము
వాటికిలొంగి నరుడునశించును
దాటగవలె నా మూడుద్వారములు

॥వేదసారమిది॥

నరకకారకము త్రివిధములవ్వి
పీడినమనుజుడు హితముకూర్చుకొని
నరకద్వారముల దరికిచేరక
మోక్షగతినిమరి అందుచుండును.

శాస్త్రోక్తమగు విధినేవదలి
మనసుకుతగిన రీతిగనడచునా
అట్టివాడు పురుషార్థము నందడు
సుఖము-మోక్షము అందగనేర్వడు

చేయదగినది చేయకూడనిది
శాస్త్రప్రమాణముగా తెలియుమయా!
శాస్త్రమునందు నుడివినరీతిని
తెలిసి, నీవు మరి కర్మలుచేయుము.

॥వేదసారమిది॥

## 17వ అధ్యాయము

# శ్రద్ధాత్రయ విభాగ యోగము

శాస్త్రవిధులకు భిన్నమునుండియు
పూర్తిశ్రద్ధతో పూజలుసలిపే
పురుషులపూజా ఫలము ఎట్టిది?
త్రిగుణాలలోఅది దేనికిచెందును?

శ్రద్ధఅన్నది సహజగుణమది
సత్వగుణము మరి రజస్తమములని
మూడువిధముల నిండియుండును
వివరించెదవిను కుంతీనందన !

మనసుకుతగినటు, శ్రద్ధనిలచును
శ్రద్ధ–జీవుని ప్రతిబింబమగు
సంస్కారమది మూలము అగును
గుణములనేలును అదియేపార్థా !

సత్వగుణముతో సురలనుతింతురు
రజోగుణముతో యక్ష-అసురులను
తమోగుణముతో ప్రేతాత్మలను
భూతగణముల పూజలుచేతురు

దంబమునిండి ఆశలుపెంచుకు
మదిలోకోరిక లన్నీనిలపి
శాస్త్రముచెప్పని రీతిలోఎన్నో
ఘోరతపస్సులు ఆచరించెదరు.

అవివేకముతో తమశరీరమును
అవయవాలను ఇడుములబెట్టి
తనువుననున్న నాకుసైతము
బాధలనిడెదరు అసురస్వభావులు

మనుజులుతినెడి ఆహారముఅది
మూడువిధములుగ తెలియుముఫల్గుణ!
యజ్ఞము-తపసు-దానముకూడ
అదేరీతిగ మూడువిధములు

ఆయువు-సత్తువ, బలమారోగ్యము
సుఖమును-ప్రీతిని పెంచగలిగినవి
రసము-చమురుతొ రుచికూడినవి
సాత్వికప్రియమగు ఆహారములు,

॥వేదసారమిది॥

దాహము పెంచి అతివేడిగల
చేదు-పులుపు-లవణము నిండిన
భుక్తము రుచ్యము, రజోప్రధానము
బాధ-దుఃఖము-రోగము పెంచును

రుచిలేనట్టిది పాసిపోయినది
అపవిత్రమ్మయి ఎపుడో వండిన
మిగిలిపోయిన ఆహారమును
తామసులెప్పుడు తినగోరెదరు

ఫలాపేక్షను మదిలో తలచక
శాస్త్రవిధినితను అనుసరించుచు
నిశ్చలమనసుతొ కర్తవ్యముగా
చేయుయజ్ఞము సాత్వికయజ్ఞము

ఫలితముకోరి ఆడంబరముతొ
పలువురుచూడగ చేసెడియజ్ఞము
రాజసయజ్ఞము అందురుయిలలో
కుంతీనందన! తెలియుమునీవు

అశాస్త్రమైనది మంత్రరహితమై
దక్షిణలేక శ్రద్ధనుంచక
అన్నదానమది లేనియజ్ఞము
తామసయజ్ఞము అందురు పార్థా !

సురల-భూసురుల-గురువుల-జ్ఞానుల
పూజలు-శుభ్రత-ఋజువర్తనము
బ్రహ్మచర్యము అహింసయున్నూ
తనువుతొచేసెడి తపసుగతెలియుము

॥వేదసారమిది॥

పరులనుగూర్చి పరుషములాడక
సత్యమునిండిన ప్రియవచనముల
పుణ్యగ్రంథముల అధ్యయనమది
"వాక్" తపస్సుగా తెలియుము పార్థా!

మనోనిర్మలత ముఖప్రసన్నత
మనశ్శాంతిమరి మౌనస్థితితో
ఆత్మనిగ్రహము భావశుద్ధియు
మనసుతో చేసెడి తపసుగ తెలియుము.

ఫలితముకోరక నే-నుడివిన-యీ
మూడువిధములగు తపసులు శ్రద్ధతో
పట్టువదలక చేసిన దానిని
సాత్వికతపమని అందురు పార్థా!

పరులనుండి మరి పొగడ్త కోరి
సత్కారములు అందుటకొరకై
ఆడంబరముగ చేయుతపస్సు
రాజసతపసది నిలకడలేనిది.

మౌఢ్యమునిండి మొండిపట్టుతో
తనువునుబాధకు గురిచేయుచును
పరులనాశము కోరిచేసెడి
తపసు-తామస తపసుగతెలియుము

దేశకాలముల పాత్రములెరిగి
కర్తవ్యముగా మదిలోతలచి
ప్రత్యుపకారము చేయగవలెనని
వారికిచ్చుటది సాత్వికదానము

॥వేదసారమిది॥

ప్రత్యుపకారము మదిలోకోరి
రాగలఫలితము లెక్కచూచుకొని
మనసునక్లేశము నింపుకొనుచును
చేసెడిదానము రాజసదానము.

దేశకాలముల పాత్రముతెలియక
అర్హతలేని వ్యక్తులందరకు
అమర్యాదమరి తిరస్కారముల
చేయుదానములు తామసమైనవి.

పరబ్రహ్మమును గుర్తించుటది
''ఓమ్-తత్-సత్'' అను మూడువిధములు
భూసురులున్నూ-వేదము-యజ్ఞము
వాటివల్లనే ఉద్భవించినవి.

వేదవిదులుమరి శాస్త్రోక్తముగ
తపసు-యజ్ఞము-దానము చేయుచు
నిర్దేశించిన విధముగనెపుడు
''ఓమ్''కారముతో ప్రారంభింతురు,

ఫలితముకోరక మోక్షముకొరకై
చేయుయజ్ఞము, తపసు-దానము
''తత్'' అనిచెప్పి ఆరంభింతురు
వివిధక్రియలను ఆచరింతురు.

''సత్'' అన - నిలకడ కలిగినదనియు
మంచిదానికది మారుమాటయి
ఉత్తమమైన కార్యములన్నీ
సత్కార్యములుగ వినుతికెక్కెను.

॥వేదసారమిది॥

యజ్ఞము-తపసు-దానములందలి
నిష్ఠను 'సత్' అని నుడువుచుందురు
దైవప్రీతికై చేయు కర్మలవి
సత్కర్మలుగా చెప్పబడినవి.

శ్రద్ధలేకను చేసెడిహోమము
దానము-తపసు, ఇతరకర్మలు
''అసత్'' అందురు ఇహపరములలో
ఫలములు-సుఖములు కలుగజేయవవి.

॥వేదసారమిది॥

## 18 వ అధ్యాయము

# మోక్ష సన్యాస యోగము

కేశిరక్కసిని కూల్చినవాడా!
కేశవ! త్యాగము అననేమిటయా?
సన్యాసముఅన సవిస్తరముగా
వివరించుము నువు నాపైదయగొని

కామ్యకర్మలను వదలిన పార్థా!
సన్యాసము అని పండితులందురు
చేసినకర్మల ఫలితమువదలుట
త్యాగము అందురు కుంతికుమారా!

దోషమువలెమరి కర్మలన్నిటిని
వదలుటమేలని అందురుకొందరు
యజ్ఞము-తపసు-దానకర్మలను
వదలకూడదని మరికొందరయా

భరతకుమారా! కర్మత్యాగమున
నానిర్ణయము నుడివెదవినుము
త్యాగముమూడు విధములుగాను
చెప్పబడినది కావున ఇలలో

యజ్ఞము-దానము-తపసు మూడును
చేయదగినవి త్యజించరానివి
వాటివలనే బుద్ధిమంతులకు
పవిత్రతన్నది కలుగుచున్నది

యజ్ఞము-దానము-తపసును పార్థా
ఫలితముకోరక చేయగవలెను
కర్తవ్యమయా ! వాటిని చేయుట
ఇదినిశ్చయము నాసిద్ధాంతము

నియతకర్మలను పరిత్యజించుట
తగదనినీవు తెలియుముఅర్జున!
అజ్ఞానముతో చేసెడి అట్టి
త్యాగము, తామస త్యాగమందురు

కర్మాచరణము దుఃఖమునిడెనని
శరీరశ్రమయని భయముతోదానిని
వదలెడిత్యాగము రాజసత్యాగము
త్యాగఫలము ఆ మనుజులకందదు

శాస్త్రవిహితముగ చేయదగిన ఆ
కర్మలనన్నియు ఫలమునువిడచి
ఆసక్తినిఎంతయు పెంచుకొనకను
చేసెడిత్యాగము సాత్వికత్యాగము

సత్యమునిండిన ప్రజ్ఞాశాలి
త్యాగిఅగుచు మరి కర్మలయందు
దుఃఖమున్నదని ద్వేషించదయా!
సుఖముకలదని ముందుకురాదు

॥వేదసారమిది॥

తనువుధరించిన జీవుడెప్పుడు
కర్మలుపూర్తిగ వదలగలేడు
కర్మఫలితము త్యజించినప్పుడు
త్యాగిఅనబడి వినుతికెక్కును

సుఖము-దుఃఖము, సుఖదుఃఖములవి
కర్మఫలములు త్యాగముచేయని
మనుజుడుపొందును మరణించగను
త్యాగికిమాత్రము అవికలుగవయా

కర్మాచరణము-దానిస్వభావము
దానికిగల ఈ అయిదుహేతువులు
సాంఖ్యశాస్త్రమున వివరించినవి
నే తెలిపెదవిను ఇంద్రకుమారా !

ఒకటి శరీరము రెండుకర్తయు
వివిధేంద్రియములు మూడవదగుచు
ఆ యింద్రియముల విధినిర్వహణయు
దైవము ఐదవ దగుచుండునయా!

శరీరమ్ముతో మనసు-వాక్కుతొ
ఆచరించెడి కర్మలన్నిటికి
మంచి చెడ్డలకు కారణములుగ
నుడివినహేతువులైదే తెలియుము

కర్మవిషయము అటులజరుగగా
సంస్కారమెరుగని బుద్ధినికలిగి
ఆత్మనుకర్తగ తలంచువాడు
ఆత్మయుకర్తల వాస్తవమెరుగడు

॥వేదసారమిది॥

కర్తనునేనను తలంపులేకను
బుద్ధియందున కర్మనుతలచక
చేయుకర్మఅది చంపుటఅయినా
పాపముఅంటదు బంధనలుండవు

జ్ఞానము-జ్ఞేయము తెలియువాడని
కర్మ హేతువులు మూడువిధములు
కర్త-కర్మ-సాధన అనునవి
మూడువిధములు కర్మాలంబన

జ్ఞానము-కర్త-కర్మను మూడును
గుణభేదములతొ మూడువిధములుగ
విభజనచేసి సాంఖ్యశాస్త్రమున
చెప్పబడినవి వివరించెదను

సర్వప్రాణుల భిన్నరూపములు
శాశ్వతమైన ఒకటనితెలిసి
భిన్నరూపముల అభిన్నతత్వము
తెలియునట్టిది సాత్వికజ్ఞానము

ఏజ్ఞానముచే సర్వప్రాణులలొ
వేఱువేఱుగా నున్నవాటిని
వేఱువేఱని తలచుచుండునొ
అట్టిజ్ఞానమగు రాజసజ్ఞానము

ఒక్కదానిలో-సర్వమదేనని
తగినహేతువే లేకుండగను
తత్వముతెలియక అల్పమయినదగు
జ్ఞానముఅగును తామసజ్ఞానము

॥వేదసారమిది॥

సశాస్త్రయుతమై ఫలితముకోరక
రాగద్వేషములు మోహములేక
చేయుకర్మను సాత్వికకర్మగ
చెప్పెదరయ్యా కుంతీనందన!

ఫలాపేక్షతో అహంకారముతో
అధికప్రయాసకు లోనయిచేసెడి
కర్మను రాజసకర్మగనెంతురు
కుంతికుమారా! తీరుగవినుము

కర్మలవలన కలుగునష్టము
నాశము బాధ సామర్థ్యమును
తెలుసుకొనక మరి అవివేకముతో
చేయుకర్మయగు తామసకర్మ

కార్యమునందాసక్తిని విడచి
అహమునువదలి మనోధైర్యముతో
సిద్ధించినను చెడిపోయినను
నిలకడనుండెడి కర్త సాత్వికుడు

రాగవశుడయి ఫలాపేక్షగల
లోభియు హింసప్రవృత్తిని కలిగి
మోదఖేదముల నందెడి యట్టి
కర్తనెరుంగుము రాజసకర్తగ

మనోనిగ్రహము లేనివాడయి
మూర్ఖుడు - ధూర్తుడు - సోమరి అయిమరి
కాలమువ్యర్థము చేసెడివాడు
దుఃఖి, ఆతడు తామసకర్త

॥వేదసారమిది॥

బుద్ధి-ధైర్యము అను రెండింటిని
గుణములబట్టి మూడు విధములుగ
పూర్తిగనుడివిన విషయమంతయు
వివరించెద విను ఓ ధనంజయా !

ధర్మప్రవృత్తిని అధర్మనివృత్తిని
చేయదగినది, చేయదగనిది
భయాభయములు-బంధము మోక్షము
తెలియగనేర్చిన బుద్ధి-సాత్వికము

ధర్మాధర్మము తెలియకపోవుట
చేయదగినది చేయదగనిది
తెలియక నిజమును తెలుసుకొనకను
చరించుబుద్ధి రాజసబుద్ధి

అజ్ఞానముతో నిండిపోయి మరి
అధర్మమ్మును ధర్మము అనుచు
ఉన్నదానిని కానిదానిగ
తలంచుబుద్ధి తామసబుద్ధి

చలించనట్టి ధైర్యముగలిగి
మనసు, ప్రాణము ఇంద్రియక్రియలు
యోగసాధనతో శాస్త్రవిధిగను
నిలపెడిధైర్యము సాత్వికమయినది

ఏధైర్యముతో ఫలాపేక్షతో
ధర్మార్థకామములు మూడునుకూడ
ఆసక్తితోతను ఆచరించునో
అట్టిధైర్యమది రాజసధైర్యము

॥వేదసారమిది॥

పాండునందనా! ఏమనుజుడు తను
దుష్టబుద్ధియై నిద్ర-భయములు
దుఃఖము దిగులు మదమును విడువడొ
అట్టి ధైర్యము తామసధైర్యము

ఏ సాధనతో మనుజుడు ఇలలో
ఆనందమును సుఖమును శాంతిని
తీరుగబడయునో అట్టిసుఖమది
మూడువిధములు వినుముతీరుగ

ఆరంభములో విషతుల్యమయి
సుఖముగపిదప పరిణమించుచు
నిర్మలబుద్ధితొ కలుగుసుఖమది
సాత్వికసుఖమని అందురు విజయా !

ఇంద్రియాలకు అందినసుఖమది
మొదటఅమృతము అనిపించుచును
పిదపవిషముగ పరిణమించును
అట్టిసుఖమది రాజససుఖము

తొలుతయుపిదప చిత్తముగెలిచి
మోహమునింపి ఏమరపించి
నిద్ర, ప్రమత్తత సోమరితనముల
కలిగెడి సుఖమే తామససుఖము

ప్రకృతిజన్యము త్రిగుణమ్ములివి
వీటిపరిధిలో నుండనిదేదియు
భూలోకమున నాకలోకమున
దేవతలందున లేనేలేదు

॥వేదసారమిది॥

బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య-శూద్రులకు
నిర్దేశించిన కర్మలు అన్నీ
వారిస్వభావము వలనకలిగెడి
గుణములవలన విభజనజరిగెను

శమదమాదులు తపసు-శుచియు
ఋజువర్తనము-శాస్త్రజ్ఞానము
అనుభవజ్ఞానము-ఆస్థికత్వము
స్వభావజనితము-బ్రాహ్మణకర్మలు

శౌర్యము-తేజము-కీర్తి-విక్రమము
సామర్థ్యము మరి ఆజినిలచుట
నాయకత్వము దానమునిడుట
స్వభావజనితము-క్షాత్రధర్మము

వ్యవసాయమ్ము గోసంరక్షణ
వ్యాపారములవి వైశ్యగుణముగా
స్వభావసిద్ధముగా జనియించును
సేవాధర్మము శూద్రలక్షణము

స్వభావసిద్ధము అయినకర్మలను
ఫలాపేక్షను వదలి చేసినచొ
జ్ఞానయోగ్యుడై సిద్ధినిపొందును
ఆ వివరము నే తెలిపెదవినుము

తనకై ఏర్పడి వున్న కర్మలను
తీరుగ అతడు ఆచరించిన
అన్నిప్రాణులకు ఆదిమూలమగు
దైవపూజయై సిద్ధినిపొందును

॥వేదసారమిది॥

పరధర్మమును శ్రద్ధగచేసిన
దానికన్నను స్వధర్మపరత
గుణరహితముగా కనుపించినను
చేయుటమేలు పాపముకలుగదు

సహజకర్మలవి దోషయుక్తమని
వదలగరాదు కుంతికుమారా !
అగ్నినిధూమము కమ్మినరీతి
దోషములన్నవి కమ్మును కర్మను

విషయములందాసక్తి నుంచక
మనుసుజయించి బుద్ధిమంతుడై
కోరికలేక త్యాగబుద్ధితో
నైష్కర్మస్థితి కలుగునుపార్థా !

కర్మసిద్ధిని బడసినవాడు
పరమాత్మనేవిధి అందగనేర్చునా
జ్ఞానముయొక్క పరాకాష్ఠను
నాబోధనతో వినుము ధనంజయ!

నిర్మలబుద్ధితొ మనోధైర్యముతొ
నిగ్రహశక్తితొ శబ్ద స్పర్శలు
రాగద్వేషములు పరిత్యజించి
ఏకాంతమున మనసుపెంచుకొని

మితభుక్తమునకు అలవడియుండి
వాక్-శరీరము-మనస్సు నిత్యము
స్వాధీనముతో ధ్యానతత్పరుడు
వైరాగ్యమును అవలంబించి

॥వేదసారమిది॥

పరధర్మమును శ్రద్ధగచేసిన
దానికన్నను స్వధర్మపరత
గుణరహితముగా కనుపించినను
చేయుటమేలు పాపముకలుగదు

సహజకర్మలవి దోషయుక్తమని
వదలగరాదు కుంతికుమారా !
అగ్నినిధూమము కమ్మినరీతి
దోషములన్నవి కమ్మును కర్మను

విషయములందాసక్తి నుంచక
మనసుజయించి బుద్ధిమంతుడై
కోరికలేక త్యాగబుద్ధితో
నైష్కర్మస్థితి కలుగునుపార్థా !

కర్మసిద్ధిని బడసినవాడు
పరమాత్మనేవిధి అందగనేర్చునా
జ్ఞానముయొక్క పరాకాష్ఠను
నాబోధనతో వినుము ధనంజయ!

నిర్మలబుద్ధితో మనోధైర్యముతో
నిగ్రహశక్తితో శబ్ద స్పర్శలు
రాగద్వేషములు పరిత్యజించి
ఏకాంతమున మనసుపెంచుకొని

మితభుక్తమునకు అలవడియుండి
వాక్-శరీరము-మనస్సు నిత్యము
స్వాధీనముతో ధ్యానతత్పరుడు
వైరాగ్యమును అవలంబించి

॥వేదసారమిది॥

సర్వముతెలుసని అహము పెంచుకొని
కర్తవ్యముఅగు యుద్ధముమానగ
ఆలోచనఅది వ్యర్థముఅగును
క్షాత్రగుణము నిను ఆజికిత్రోయును

యుద్ధముచేయుట అన్నది పార్థా!
స్వభావసిద్ధము క్షత్రియకర్మ
మనసులో విముఖత చూపినకాని
కర్మాధీనుడ వగుటతప్పదు

అన్నిప్రాణుల హృదయమునందు
నెలకొనియున్న సర్వేశ్వరుడు
యంత్రము-బొమ్మల నాడించినటు
మాయతొ జీవుల నాడించును విను.

అట్టి ఈశ్వరుని సర్వేశ్వరుని
చిత్తమునందు పూర్తిగనిలపి
శరణువేడిన చిత్తశాంతితో
శాశ్వతస్థానము అందగతగుదువు.

ఈ జ్ఞానమువిను రహస్యమైనది
రహస్యాలలో పరమరహస్యము
నీకది ఉపదేశించబడినది
నిర్ణయించుకొని ఆచరింపుము.

రహస్యాలలో రహస్యమైనది
శ్రేష్ఠమయినది తెలిపెదవినుము
నాకు హితుడవు ప్రీతిపాత్రుడవు
నీ హితమునకై చెప్పెదవినుము.

॥వేదసారమిది॥

చిత్తమునాపై నిలుపుము అర్జున
భక్తితో నువ్వు నను ఆరాధించుము
నమస్కరించుము నన్ను పొందెదవు
ప్రతినగతెలిపితి హితుడవుగనుక.

సర్వధర్మములు నాకై త్యజించి
నన్నుశరణని నమ్మికొన్నచో
సర్వపాపముల తొలగజేతును
మోక్షమిచ్చెదను వినుము కిరీటి !

తపసు, భక్తి లేనివానికి
తెలియ, కోరికది లేనివానికి
గురువుల సేవ చేయనివానికి
నను ద్వేషించెడి వానికి చెప్పకు.

అతి రహస్యమగు ఈ తత్త్వమును
నా భక్తులకు ఉపదేశించిన
నను భజియించిన వాడతడగును
అతడు పొందు నను-నిస్సందేహము

నాకు ప్రియమును కూర్చెడివారు
అతనినిమించినవారు లేరయా !
వానిని మించిన అతి ప్రియతములు
భువిలో నాకు దొరకరు పార్థా!

మనతో జరిగిన యీ సంవాదము
పవిత్రమైన సంభాషణము
పఠించువాడు జ్ఞానయజ్ఞమున
నిశ్చయముగ నను సేవించినటు.

॥వేదసారమిది॥

శ్రద్ధనిండి మరి అసూయవిడచి
దీనిని శ్రద్ధగ వినినవాడును
మోక్షమునందును, పుణ్యమూర్తియై
శుభమగు లోకములందును పార్థా!

ఓ ధనంజయా! ఏకాగ్రతతో
మనసును నిలపి నాఉపదేశము
వింటివ-నీభ్రమ, అజ్ఞానజనితము
సంపూర్ణముగా నశించిపోయెన.

పార్థుడు పలికెను-అచ్యుత నీదగు
ఉపదేశముతో జ్ఞానము కలిగెను
అజ్ఞానము, సందియమంతా పోయెను
నీ ఆనతినే తలను ధరింతును.

వాసుదేవునికి కుంతీసుతునకు
మధ్య జరిగిన అద్భుతమైన
సంవాదమును వినగా నాకు
మది పులకించెను అనె సంజయుడు.

వ్యాసానుగ్రహమైన యోగము
శ్రేష్టము-గుహ్యము అగు ఉపదేశము
యోగీశ్వరుడగు కృష్ణుడు స్వయముగ
నుడువగ వింటిని నేతరించితిని.

రాజా! నేను యీ సంవాదము
కేశవార్జునుల పవిత్రభాషణ
మదిలోతలచి పులకించెదను
పుణ్యమునాదని పొంగిపోదును.

॥వేదసారమిది॥

ఆదిదేవుడగు నారాయణుడు
సర్వమునిండి దర్శనమిడుట
కన్నులనుండి దూరముకాదది
తరగనట్టి ఆనందము నిచ్చును.

ఎచ్చట యోగీశ్వరుడగు కృష్ణుడు
ధనుసు ధరించిన పార్థుడు కలరో
సిరులు-విజయము-నీతియు-తెలివి
అచ్చట నెలకొను నిశ్చయమ్ముగ.

''వేదసారమిది భగవద్గీత
ఇహ పరములకు బంగరుబాట
ఆదిదేవుడగు నారాయణుడు
ముదమున పార్థునకుపదేశించెను.''

## సర్వే జనాస్సుఖినో భవంతు

# గీతామహాత్మ్యము

ధరపలికెను శ్రీభగవానునితో
ఓపరమేశా ! జగదాధారా !
ప్రారబ్ధమును అనుభవించుచు
నిశ్చలభక్తి ఎటుబనగూడును ?

ప్రారబ్ధమును అనుభవించుచు
నిత్యముగీతను పఠించువానికి
ముక్తియు-సుఖముకలుగును-కర్మల
బంధములుండవు అనె పరమాత్మ

గీతనుధ్యానము చేసినంతట
తామరాకునకు నీరుఅంటనటు
సర్వదోషములు మహాపాపములు
అంటవు-అదియే గీతమహాత్మ్యము

గీతాగ్రంథములున్న స్థలములు
పఠించునట్టి తావులన్నియును
అతిపవిత్రమగు నెలవులు అగును
ప్రయాగమొదలగు తీర్థములగును

అవి నిలయములు గోపాలురకు
గోపికలకును నారదమౌనికి
సురలు-ఋషులు-యోగులుందురు
ఉద్ధవాదులు-పన్నగులుందురు

గీతను చదివెడి స్థలములందున
చదివించెడి ప్రతి నెలవునందున
అర్థముతరచెడి అన్నితావుల
ఉందునునేను నిశ్చయముగను

నా ఆశ్రయము గీతయె వినుము
నా నెలవుగనే గీతను తెలియుము
గీతలొనుడివిన జ్ఞానముతోనే
ముల్లోకములను ఏలుచుందును

అర్థ-మాత్రా రూపముగలది
అక్షరమైన బ్రహ్మస్వరూపము
నిత్యమైన ఈ గీతాశాస్త్రము
ఉత్తమమైన బ్రహ్మవిద్యయే

చిదానందుడగు శ్రీకృష్ణుడు-తను
కిరీటికిచ్చిన ఉపదేశమిది
వేదసార మానందరూపము
తత్వజ్ఞానము ఇచ్చును-కోరిన

నిశ్చలమనసుతొ నిత్యము గీతలొ
పదునెనిమిది అధ్యాయములన్ని
పఠించునరుడు బ్రహ్మజ్ఞానముతొ
పరమపదమును చేరుట తథ్యము

గీతలొసగమునె-పఠించువానిక
గోవును దానము చేసినఫలము
మూడవవంతున గంగాస్నానము
ఆరవవంతున సోమయాగము

ఫలితము అందును నిశ్చయమ్ముగ
అటుగాకున్న ఒక అధ్యాయము
భక్తితొచదివిన రుద్రలోకమున
చిరకాలముండును రుద్రగణముతో

ధరణీ ! వినుము అధ్యాయములో
నాల్గవవంతు పారాయణమున
మన్వంతరమగు కాలమంతయు
మానవజన్మను ఎత్తుటఫలము

పదిశ్లోకములు లేదా అయిదు
నాలుగుగాని మూడయినా మరి
రెండు శ్లోకములు-ఒకటయినాను
అందులొసగము అర్ధశ్లోకము

నిత్యము పారాయణగా చదివిన
చంద్రలోకమున పదివేలేండ్లు
ఉండును మరియు పారాయణమున
మృతినొందిన దేవత్వమునందును

మానవజన్మతొ పదేపదే తను
గీతనుపఠించ మోక్షమునందును
గీతనుతలచుచు ప్రాణమువదలిన
సద్గతిపొందును ధన్యుడు అగును

మహాపాపముల నెన్ని చేసినను
గీతార్థమును వినమనసున్న
అట్టివానికి వైకుంఠమున
వాసుదేవుని సన్నిధిదొరకును

ప్రతిదినము తను, నిత్యకర్మలను
ఆచరించుచు గీతార్థమును
ధ్యానించినఅగు జీవన్ముక్తుడు
పునర్జన్మను పొందడు అతడు

జగత్తులోన గీతాశ్రయమున
జనకుడు మొదలగు ధరణీధవులు
ఎందరొ పాపములన్నితొలగగ
పరమాత్మపదమును పొందగలిగిరి

గీతాపారాయణమును చేసి
మహాత్మ్యమ్మును పఠించకున్న
పారాయణమది వ్యర్థము అగును
చివరకుశ్రమగా మిగులును అంతయు

మహాత్మ్యమ్ముతో గీతనుచదివిన
ఫలితముకలుగును నిశ్చయమ్ముగా
అట్టివానికి దుర్లభమయిన
మోక్షము దొరకును నిస్సందేహము.

ప్రాచీనము అగు ఈమహాత్మ్యము
గీతమాహాత్మ్యముగ నుడివితి
గీతనుపఠించి వెంటనె దీనిని
చదివిన ఫలితము తప్పక దొరకును.

శుభం



## ఈ "గేయమాల" ముద్రణకు ప్రోత్సహించిన సహృదయులు —

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ శ్రీరామగిరి రామచంద్రరావుగారు | అడ్వకేట్ | హైదరాబాద్ |
| 2. | శ్రీ ఎమ్. ఎన్. కె. శాస్త్రిగారు | అడ్వకేట్ | హైదరాబాద్ |
| 3. | శ్రీ బి. పాండురెడ్డిగారు | ముసారాంబాగ్ | ,, |
| 4. | శ్రీ టి. మల్లిఖార్జునరావుగారు | మలక్ పేట | ,, |
| 5. | శ్రీ బి. కె. భగవాన్‌గారు | అడ్వకేట్ | ,, |
| 6. | శ్రీ ఎమ్. చలపతిరెడ్డిగారు | అడ్వకేట్ | ,, |
| 7. | శ్రీ క్రిష్ణస్వామినాయుడు గారు | దిల్‌సుఖ్ నగర్ | ,, |
| 8. | శ్రీ కిషన్‌సింగ్‌గారు | దిల్‌సుఖ్ నగర్ | ,, |
| 9. | కుమారి పి. సుబ్బలక్ష్మి | దిల్‌సుఖ్ నగర్ | ,, |
| 10. | శ్రీ ఎన్. రత్నంచెట్టిగారు | | ,, |
| 11. | శ్రీ మండల నరహరిరావుగారు | ,, | ,, |
| 12. | శ్రీ ఆదూరి వెంకటేశ్వరరావుగారు | | ,, |
| 13. | శ్రీ అద్దంకి కనకయ్యగారు | ,, | ,, |
| 14. | శ్రీమతి పేరినాగమణిగారు | ,, | ,, |
| 15. | శ్రీ వడ్లమాని సోమసుందరంగారు | విజయనగరం | |

—::—



గోస్తనీనది ఉన్న-తణుకు-పుట్టిన ఊరు
జన్మ నిచ్చిన పుణ్యమూర్తి మహాలక్ష్మమ్మ
నా పాలిదేవుడు కామేశ్వరుడు-తండ్రి
శ్రీరామచంద్రుడు ఆరాధ్య దైవము.